GVP01D190

H:- 9.5
W:- 7.2

వి.జి.యస్. పబ్లిషర్స్ సహకారంతో

# కృష్ణాజిల్లా
# శాసన స్రవంతి




ఆంధ్రప్రదేశ్ స్వర్ణోత్సవాల సందర్భంగా

## కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ
సమర్పణ

GT.V.P01D190
H:- 9.5
W:- 7.7

వి.జి. ఎస్. పబ్లికేషన్స్ సౌజన్యంతో

# కృష్ణాజిల్లా శాసన స్రవంతి

శ్రీ కె. ప్రభాకర రెడ్డి, IAS
ఎడిటర్, కృష్ణా జిల్లా న్యూ మాన్యువల్




కృష్ణాజిల్లా న్యూమాన్యువల్ కమిటీ
ప్రచురణ

**KRISHNA ZILLA SAASANA SRAVANTHI**

**కృష్ణాజిల్లా శాసన స్రవంతి**

Editor
**Sri K. Prabhakara Reddy,** IAS

Asst. Editors
**Sri Lanka Venkata Ramana**
**Dr. G.V. Purnachand**

© Krishna District New Manual Comittee.

Rs. 100/-

1st Edition
Dec, 2005

Printed at : Vinayak offset Printers, Vijayawada-2

Published by :
**The Krishna District New Manual Comittee**



# శ్రీకారం

చరిత్ర రచనకు తామ్రపట్టికలు, ప్రాచీన పత్రాలు, శిలా శాసనాలు గొప్ప ఉపకరణాలు. ఇవి కృష్ణా జిల్లాలో అసంఖ్యాకంగా లభించాయి. పరిష్కారానికి, ప్రచురణకు నోచుకొన్నవి మాత్రం వందల సంఖ్యలో ఉన్నాయి. వాటిలో కూడా మూల స్వరూపాలు పోయినవి పోగా మిగిలినవి ఎక్కడ ఉన్నాయో తెలియదు. ప్రచురణ భాగ్యం పొందిన శాసన పాఠాలు ఒక్క చోట లేవు. అన్నీ చెల్లాచెదురుగా ఉన్నాయి. ఫలితం ఈ జిల్లా చరిత్ర అస్పష్టంగా మిగిలింది కనుక లభిస్తున్న శాసన పాఠాలనన్నింటిని ఒక దరికి చేర్చడం అవసరమని కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూమాన్యువల్ కమిటీ భావిస్తున్నది.

వాస్తవానికి ఈ జిల్లాకు కలెక్టర్లుగా పనిచేసిన రాబర్ట్‌సన్, ఓక్స్, స్టోన్ హౌస్, రాబర్ట్ స్యువెల్, థార్న్‌హిల్, ఎన్. రామేశన్‌లాంటి సుప్రసిద్ధ చరిత్ర రచయితలే కనుక లేకపోతే మనకు మన చరిత్ర తెలిసివుండేది కాదు. ఇక ఈ జిల్లాకు హెడ్ అసిస్టెంట్ కలెక్టర్‌గా పనిచేసిన జయంతి రామయ్య పంతులుగారే లేకపోతే వెలుగే లేదు. అంతా చీకటే!

ఈ జిల్లాకు కలెక్టర్‌గా పనిచెయ్యడం నా అదృష్టం. నా పూర్వపు కలెక్టర్లు చేసిన శాసన పరిశోధన ఏమిటో ప్రచురణ రూపంలో వెలుగులోకి తేవడం బాధ్యతగా భావించాము. పర్యవసానమే 'కృష్ణా జిల్లా వైభవం' కార్యక్రమాలు. అందులో ప్రధానమైనది 'కృష్ణా జిల్లా శాసన స్రవంతి' సంచిక అవతరణ ఇందులో పొందుపర్చిన 42 శాసనాలు, వాటి వివరణలు మేము తలపెట్టిన సమగ్ర ప్రచురణకు శ్రీకారం మాత్రమే?

ఈ 'కృష్ణా స్రవంతి' ముద్రణకు ముందుకు వచ్చిన మా కమిటీ సభ్యుడు వి.జి.ఎస్. పబ్లిషర్స్ అధినేత శ్రీ ఎస్. రామారావు గారికి, సంచికలో వ్యాసాలు వ్రాసిన రచయితలకు, 'కృష్ణా వైభవం' వేదిక సమకూర్చిన విజయవాడ దుర్గామల్లేశ్వర సిద్ధార్థ మహిళా కళాశాల యాజమాన్యానికి, సహ నిర్వాహకులైన ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్, ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కియాలజీ, దివి చరిత్ర పరిశోధక మండలి, 'కృష్ణా వైభవం' సదస్సులలో పాల్గొన్న వక్తలకు-

ముఖ్య అతిథిగా వచ్చి, మా కార్యక్రమాలలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలక్షన్ కమిషనర్, కృష్ణా జిల్లా పూర్వపు కలెక్టర్ శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి, I.A.S. గారికి ధన్యవాదాలు.

**(కె. ప్రభాకరరెడ్డి, I.A.S.)**

చైర్మన్, కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూమాన్యువల్ కమిటీ

# OUR TEAM

**Chairman**:
**Sri K. PRABHAKARA REDDY**, IAS
Former Collector, Krishna Dist (2003-2005)
Adl. Secretary to
Andhrapradesh Chief Minister
Editor of the New Manual

**Assistant Editors:**
Sri Lanka Venkata Ramana
Dr. G.V. Purnachand.

**Editorial Board:**
Sri Nanduri Rama Mohana Rao
Sri C. Raghavachari
Padmasri Turlapati Kutumba Rao
Sri V.R. Bomma Reddy
Sri Veeraji
Sri Andavilli Satyanarayana
Sri A. Satyanarayana
Sri Krishnaji

**Managing Committee:**
Sri Dasari Ramakrishna
Sri Parvathaneni Shanti Kishore
Sri Immadisetty Rama Kumar
Sri Seeram Rama Rao
Sri E. Gopala Krishna Reddy

**Consultant:**
Prof. A. Anuradha

**Co-ordinators:**
Sri Ch. Purnachandra Rao
Sri A. Abja Rao

**Advisory Committee:**
Sri M. Narayana Prasad
Sri Ashok
Sri Babji
Sri R. Rama Swamy
Sri Guttikonda Subba Rao
Sri Mandava Sree Rama Murty
Sri Maganti Subrahmanyam

# శాసన పర్వం

ఇందులో...

# 1. బెజవాడ యుద్ధమల్లుని శాసనం

ఈ శాసన కాలం క్రీ॥శ॥ 820- 898.

చాళుక్య రాజవంశంలో ప్రసిద్ధుడైన యుద్ధమల్లుడు అనే రాజు వేయించిన రాతి శాసనం. మూడు వైపులా నున్నగా చెక్కిన త్రికోణాకారంగల ఒక పెద్ద బండరాయిపై చెక్కిన శాసనం. మొదటివైపు 17 లైన్లు, రెండవవైపు 19 పంక్తులు, మూడవవైపు పది లైన్లు ఉన్నాయి. అయినా ఇది అసంపూర్ణ శాసనం. యుద్ధమల్లుడు నేటి గుంటూరు జిల్లా చేబ్రోలును రాజధానిగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పరిపాలించాడు. ఒక మఠం కూడా నిర్మించాడు. ఆ మఠంలో గొరగలకు మాత్రమే స్థానం ఉంటుంది.

యుద్ధమల్లుడి తాతగారి పేరు మల్లపురాజు. మల్లపురాజు బెజవాడలో అందమైన గుడి కట్టించాడు. మనుమడు యుద్ధమల్లుడు ఆలయానికి ముందు సుందరమైన గోపురం నిర్మించాడు. ఆ రోజుల్లో జైనులకు, శైవ మతస్థులకు మధ్య వైరం ఉండేది. రాజు యుద్ధమల్లుడు శైవమతావలంబి. రాజధాని చేబ్రోలులో తన ఇష్టదైవమైన కుమారస్వామికి గుడి కట్టించాడు. ఆనాటి కల్లోలంలో గుడికి భద్రత లేకపోయింది. అందువల్ల కుమారస్వామి విగ్రహాన్ని బెజవాడ తీసుకొనివచ్చి గుడి కట్టించి అందులో ప్రతిష్టించాడు. ఒక మఠం కూడా నిర్మించాడు. ఆ మఠంలో గొరగలకు మాత్రమే బస కల్పించాడు. ఈ నిబంధన కట్టుదిట్టంగా అమలు జరగడానికి ఒక అధికారిని కూడా నియమించాడు.

తెలుగుభాష ప్రాచీనతను తెలియజేప్పే పద్య శాసనం. మధ్యాక్కర వృత్తమాలిక ఈ పద్యాలలో కనిపిస్తుంది.. పూర్వ వేంగి చాళుక్య కాలంనాటి లిపి ఈ శాసనంలో కనిపిస్తుంది..

ఇప్పటి వర్ణక్రమం ప్రకారం పాదం ఒక పంక్తిగా వ్రాస్తే మొత్తం 5 పద్యాలు అవుతాయి. ఈ శాసనం 1892లో బెజవాడలో దొరికింది. ఆ రోజుల్లో (1892) మల్లేశ్వరస్వామి గుడికి, ప్రాకారానికి మధ్యగల ఖాళీ స్థలంలో వంటగది ఉండేది. ఆ వంటగది దగ్గరగల మట్టిదిబ్బ తవ్వుతూ ఉండగా దొరికింది.

మూడు ముఖాలుగల ఆ శాసనం మొదటివైపు పై నుంచి క్రిందకు చదవాలి. రెండవ వైపు క్రింద నుంచి పైకి చదవాలి. మూడవ వైపు మాత్రం మళ్ళీ పై నుంచి క్రిందకు చదవాలి. ఇది శాసనం ప్రత్యేకత. ●

## శాసన పాఠం

### మొదటి ప్రక్క

1. స్వస్తి నృపాంకుశాన్త వత్స
2. లసత్యత్రినేత్ర విస్తర శ్రీయుద్ధ
3. మల్లుణ్ణనవద్య విఖ్యాత కీర్త్తి
4. ప్రస్తుత రాజాశ్రయుణ్ణు ద్రిభు
5. వనాభరణుణ్ణు సకల వస్తు స
6. మేతుణ్ణు రాజసల్కి భూ వల్లభు
7. ణ్ణుత్త్రి పరగంగ బెజవాడ గొమ
8. ర స్వామికి భకుణ్ణైగుడియు ని
9. రుపమమతి నృపధాముణ్ణెత్తించ్చె
10. నెగిదీచ్చె మఠంబు గొరగల్గాకొరు
11. లిన్దు విడిసిబృన్దంబు గొనియు
12. ణ్ణు వారు- రిగాక యబ్బార
13. ణాసివ్రచ్చిన పాపంబు గొ
14. ణ్ణు వెలయంగ నియ్యోట్టు అస్సి
15. మలినురై విడిసిన వ్రో
16. లగల తానఎపతులును రా
17. జు పట్టంబు గట్టిన పతి

### రెండవ ప్రక్క

**(ఒరిజినల్‌లో 17వ లైను తరువాత రెండవ ముఖంలో క్రింది నుంచి చదవాలి. అప్పుడు రెండవ ముఖం ఇలా ఉంటుంది)**

1. యునలియం బయ్యారల
2. వెల్పాటించిన నశ్వమేధంబు
3. ఫల బుపేక్షించిన లింగం బ

4. ఱిసిన పాపంబు దమకు జన
5. నుత చేబ్రోలనుణ్డి బెజ
6. వాడ జాత్రకువచ్చి త్రిణ
7. యనుసుతు ణ్డొణ్డు సోటు మె
8. చ్చక తివిరి యిన్నెలవ యనము
9. ణ్డు సేకొని యిన్ను ప్రత్యక్ష
10. బయిన్న నిచ్చగని మల్లణ్డె
11. త్తించె గుడియు మఠంబు
12. సుంగార్త్తి కేయునకు దీనింజేబ్రో
13. లు యేలేడు (వా) రతిరం బేలు
14. (వా)రొణ్డు సోటి గొరగ
15. (లు) ను బెట్టు వేరు గనుజ(ను)
16. యాస్తితి సేకొణి కాచు(వా)
17. ర దీనిన్దారు నిల్పినవారు
18. (స్థి)తి డప్పి యఱిపుట వా
19. (పం) బుగాన

**మూడవ ప్రక్క**

1. రమనతో బెజవాడ కెల్ల
2. బెడంగును రక్షయుం గాను
3. న్దమ తాత మల్లపరాజు వే
4. రెఱు దానుం గట్టించెం గ్రమ
5. బున దానిక కలశ బిడ్డ
6. ట్లు గామొగమాడు సమ
7. రంగశ్రీ యుద్ధమల్లుణ్డెత్తి
8. ంచె నమిత తేజుండు తన
9. ధమ్మ్ర వొడంబడి కాదు నృపు
10. లకున్ద-

(అసంపూర్ణము)

శాసనం మొదటి ప్రక్క ప్రతిరూపం

# 2. చట్టపుని శాసనం

ఇది క్రీ॥శ॥ 1878లో అప్పటి కృష్ణా జిల్లా కలెక్టర్ రాబర్ట్ స్యుయెల్ కనుగొన్న శిలా శాసనం. ఆయన గొప్ప చరిత్ర పరిశోధకుడు. కృష్ణా జిల్లా చరిత్రను వెలుగులోకి తెచ్చిన మహాపురుషుడు. జిల్లాలో 68 శాసనాలు కనుగొన్నాడు.

ఇంద్రకీలాద్రిపై గోవిందమఠం ప్రక్కన ఆయన త్రవ్వకాలు జరిపించినప్పుడు మట్టిదిబ్బలో ఈ శాసనం కనబడింది. ఇది మూడున్నర అడుగుల ఎత్తు రెండు అడుగుల మందంగల బండరాయిపైన చాళుక్య లిపిలో చెక్కించిన శాసనం. జల్పయ్య అనే వ్రాయసగాడు ఈ శాసనం చెక్కాడు. రాళ్ళపై అక్షరాలు వేగంగా చెక్కడంలో మహా నిపుణుడు.

ఆంధ్రదేశ చరిత్రలో, ముఖ్యంగా కృష్ణా జిల్లా చరిత్రలో ముఖ్యమైన ఘట్టాన్ని విశదీకరిస్తున్నది. ఈ శాసనం ప్రకారం విక్రమాదిత్యుని కుమారుడైన విష్ణువర్ధన మహారాజు పేరిట ఛట్టపయ్య అనే వ్యక్తి బెజవాడలో ఇంద్రకీలాద్రిపై పార్థీశ్వర ఆలయం నిర్మించాడు. ఛట్టపయ్య ఈ గుడిని విష్ణువర్ధన మహారాజు అధికారంలోకి వచ్చిన 17వ సంవత్సరం సందర్భంగా నిర్మించి ఆయనకు అంకితం చేశాడు.

ఈ శాసనం ప్రకారం విష్ణువర్ధనుడు విక్రమాదిత్యుని కుమారుడు. ఆయనకు సర్వలోకాశ్రయుడు అన్న బిరుదు ఉన్నది. తూర్పు చాళుక్య రాజవంశంలోని చాలామంది రాజులకు ఈ బిరుదు వున్నది. అంతేగాక ఈ బిరుదుగల విష్ణువర్ధన మహారాజులు కూడా చాలా మంది ఉన్నారు.

అయితే విక్రమాదిత్యుని కుమారుడైన విష్ణువర్ధన మహారాజు అంటే మొదటి చాళుక్య భీముడు. ఆయన ఇంటిపేరు ఇమ్మడి. ఇమ్మడి చాళుక్య భీముడని అంటారు. బిరుదులతో సహా ఆయన పేరు సర్వలోకాశ్రయ ఇమ్మడి చాళుక్య భీమ విష్ణువర్ధన మహారాజు. ఈయన దాదాపు 30 సంవత్సరాలు ఈ ప్రాంతాన్ని పాలించాడు. చాళుక్య భీముడు క్రీ॥శ॥ 890 ప్రాంతంవాడు.

## శాసన పాఠం

1. స్వస్తినవ్వర్గ లోకాశ్రయ
2. శ్రీ విష్ణువర్ధన మహారాజుల
3. ప్రవర్ధ మాన విజయారాజ్య సంవత్స
4. రంబుళ్ పదిఏఱుగు నెణ్డ విక్రమా
5. దిత్య తనయ శ్రీ విష్ణువర్ధ నప్రసాదాచ్చ
6. ట్ట పాఖ్యేన యిన్ద్రకీలే ప్రతిష్ఠితః పార్థీశ్వరః॥
7. సామాన్యోయం ధర్మ్మ సేతు నృపాణాం కాలే కాలే
8. పాలనియ్యోభవద్భిః సర్వ్వానే తాన్భా వినః పా
9. ర్థి వేన్ద్రాన్ భూయో భూయో యాచతే రామ
10. భద్రా॥ శ్రీ జల్పేయం శీఘ్రలిఖితర్.

కృష్ణా జిల్లాలో చారిత్రకంగా శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు ఆలయం చాలా పురాతనమైనది. అయితే అక్కడ శాసనాలన్నీ క్రీస్తు శకం 9- 10 శతాబ్దాల తరువాత కాలంనాటివే. జిల్లాలో తరువాత ప్రసిద్ధమైనది విజయవాడ మల్లీశ్వరాలయం. ఒక్క బెజవాడలోనే 110 శాసనాలున్నాయి.

# 3. పల్లకేతుని శాసనం

ఇది కూడా స్యుయెల్ దొరకు దొరికిన శాసనమే. అయిదు అడుగుల ఎత్తు, మూడు అడుగుల వెడల్పు, రెండున్నర అడుగుల మందంగల బండరాయిపై చెక్కిన శాసనం.

పల్లకేత భూపాలుడు వేయించిన శాసనం. ఇతడు 11వ శతాబ్దంలో కొండపల్లిని రాజధానిగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పాలించాడు. కాడ్వెట్టి వంశానికి చెందినవాడు.

ఆరాధ్యత్రయం అనబడే ముగ్గురిలో ప్రథముడైన శ్రీపతి పండితారాధ్యుడు. మహా శివభక్తుడు. శివునికంటె శివభక్తులే గొప్ప అని నిరూపించినవాడు. అస్పృశ్యులైనా శివభక్తులైతే బ్రాహ్మణులకంటె గొప్పవారేనని ఆయన సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ఆనాటి వైదిక మతస్థులకు నచ్చలేదు. ఆ కోపంతో ఆయనను వెలివేశారు. అందుకు ఆయన కోపించి తన మంత్రశక్తితో నిప్పు పుట్టించి, ఆ నిప్పును తన పట్టు ఉత్తరీయంలో మూటగట్టాడు. ఆ మూటను జమ్మిచెట్టు కొమ్మకు కట్టాడు. ఆ మూటను ఎవరైనా దించే వరకు విజయవాటిక (విజయవాడ) నగరంలో ఎక్కడా నిప్పు రాచుకోదని శాసిస్తూ అగ్నిబంధనం చేశాడు. నాలుగు రోజులైంది. నిప్పు ఎక్కడా లేదు. వంట వార్పు లేదు. జనం తల్లడిల్లిపోయారు. ఈ సంగతి కొండపల్లిలోని పల్లకేత భూపాలుడికి తెలిసింది.

శ్రీపతి పండితారాధ్యుడు పల్లకేత భూపాలుడికి గురువు. తన గురువుగారికి కోపం వచ్చి శపించాడని తెలుసుకొని అజ్ఞానులైన ప్రజలను క్షమించమని ప్రార్థించాడు. ఆయన శాపాన్ని ఉపసంహరించాడు. ఈ వృత్తాంతం గల శాసనం ఇది. అంతే కాదు-

క్రీస్తుశకం 5 - 6 శతాబ్దాల మధ్యకాలంలో విజయవాడను రాజధానిగా చేసుకొని విష్ణుకుండిన వంశానికి చెందిన నాల్గవ మాధవవర్మ ఈ ప్రాంతాన్ని పాలించాడు. ఆయన కుమారుడు నిర్లక్ష్యంగా రథం నడుపుతున్నప్పుడు ఆ రథం క్రింద ఒక బాలుడు పడి చనిపోయాడు. ఆ బాలుని తల్లి మహారాజుకు ఫిర్యాదు చేసింది.

మాధవవర్మ నిందితుడు తన కుమారుడని చూడకుండా మరణదండన విధించాడు. మాధవవర్మ ధర్మ నిరతికి కనకదుర్గాదేవి మెచ్చుకొని బంగారం నాణాలు వర్షంగా కురిపించిందట. ఈ వృత్తాంతం కూడా ఈ శాసనంలో వుంది.

అర్జునుడు పాశుపతాస్త్రం కోసం ఇంద్రకీలాద్రిపై తపస్సు చేసిన కథ కూడా ఈ శాసనంలో వుంది.



### శాసన పాఠం

1. వితస్తి విస్తుతే నాపిసర్వై స్తులిత తేజసా పితాసేషా
2. బ్ధితోయేన కుంభజే నాప్యగస్తినా॥ పూర్వం కృతజయే శాసనా
3. మాపి తదనంత్తరం ఆరాధ్య మల్లయుద్ధేన ఫల్గునే సకృతా
4. భిదః॥ మల్లేశ్వర ఇతిఖ్యాత సన్నిధత్తే మహేశ్వరః శ్రీమద్విజ
5. యవాటాఖ్యపురే కృష్ణావిభూషణే, కలౌ శ్రీమచ్చ కాబ్దేబ్ధి
6. శశిసాయక సమ్మితే రాజా మాధవవర్మ్మా భూద్విఖ్యాతోధ
7. రణీతలే॥ తతస్వపుత్రేణ హతే తింత్రిణీ జీవిని సుతేధర్మ్మా స
8. ంరక్ష ణనార్త్తా యస్వపుత్ర మవధీత్సరాట్॥ తతో మల్లేశ్వరః
9. ప్రీతః స్వర్న్ణ వృష్టిం వవర్షచ శిశు పుత్రకయోః ప్రాణం దత్తవా
10. ంస్తస్యకీర్తయే॥ తత శ్రీ పండితారాధ్యనామ్నా భక్తోత్తమేనచ
11. శివభక్తా ఏవమానం దేవర్షి భ్యోధికా ఇతి చీనాంబరేగ్నిం సంస్తా
12. ప్య శమీకోమల శాఖయా బద్దే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షస్సమ
13. జాయత ఈదృగ్విధం మహాదేవం భక్తవత్సల మవ్యయం మల్లేశ్వ
14. రం సమారాధ్య రేజిరేప్రిధివీభుజః॥ స్వస్తి పరమ వంశోద్భవ భార
15. ద్వాజగోత్ర ఖట్వాంగ ధ్వజ ప్రిషభలాంఛన కాంచీపురేశ్వర కడు
16. వాయు పఙఘోషణ పల్లవకులతిలక పాదాంబుజ సేవత అం
17. నువ కామకులాది నాయక అనేక బంధ్దు జనాశ్రయ పతిహి
18. తా చరణ పతిమెచ్చుగండ్డ నొడువడి సాహసార్జున సంగ్రామ
19. రామ సమరైక భీమ డక్కునూళ్ళ శాసనాధిప శ్రీ బెజవాడ మల్లే
20. శ్వర దేవదివ్య శ్రీ పాదపద్మారాధక పరబల సాధక విప్రజనా
21. శ్రయశ్రీ వేంగిదేశ చాళుక్య సంకకాఙ పరమండల చూఙకాఙ
22. పతిదేవ గురుద్విజ పాదభక్తులు నుర్వరరిపుజముండునునైన
23. శ్రీమన్మహా మండ్డలేశ్వర పల్లకేత భూపాలుండు నిఖిలలోక ప్ర
24. ... కాడ్విట్టి మహీపాలు వంశమున నవతరించి భువన విజ్ఞ
25. ...........త ప్రతాప....-



# 4. కిరాతార్జున స్తంభం

1878లో కనకదుర్గ కొండ శిఖరంపైన రాబర్ట్స్యుయెల్ కనుగొన్న అందమైన శాసనం. ఈ శాసనం ప్రత్యేకత అందమైన శిల్పాలు ఉండడం. ఇంద్రకీలాద్రిపై శివునికోసం అర్జునుడు తపస్సు చేసిన కథను ఈ శిలపై చెక్కారు. శిల్పాన్ని, శాసనాన్ని విజయాచార్యుడు అనే శిల్పి మలచాడు.

ఇది మూడు ముఖాలు, అయిదు అడుగుల ఎత్తు, 2 అడుగుల వెడల్పు, మూడు అడుగుల మందంగల మెత్తని రాయి మీద వేసిన శాసనం. ఇది సంస్కృత శ్లోకాలలో వుంది.. మొదటి ప్రక్క 14 పంక్తులు, రెండవవైపు 7 లైన్లు వున్నాయి. పొందికైన లిపి. లిపి స్వరూపాన్నిబట్టి శాసనం 12వ శతాబ్దానిది కావచ్చును.

కల్యమబోయుని కుమారుడు త్రికోటబోయ ఈ శాసనం వేయించాడు. ఇతడిది బెజవాడ. ఆ రోజుల్లో నేటి విజయవాడను పెచ్చవాడ అనేవాళ్ళు.

ద్వాపరయుగంలో అర్జునుడు ఇంద్రకీలంపై తపస్సు చేశాడు. తపస్సు చేయడానికి అనువైన ప్రదేశాన్ని ఒక యక్షుడు అర్జునుడికి చూపించాడట. యక్షుడే శాపవశం చేత త్రికోటబోయిగా జన్మించాడు.

కృష్ణా జిల్లా దివిసీమ ఎడ్లంక గ్రామాన్ని ఆనుకొని కృష్ణానది మధ్యలో కామరాజుగడ్డ గ్రామం వుంది. ఆ గ్రామ కైఫియ్యత్తు కథనం ప్రకారం త్రికోటబోయి తన శాపాన్ని బాపుకొనడానికి కృష్ణానదిలో స్నానం చేసి పూర్వరూపం పొందాడు.

శాసన శిల క్రింద నుంచి పంక్తులు చెక్కబడి ఉన్నాయి. అందువల్ల క్రిందనుంచి పైకి చదవాలి. రెండవవైపు పై నుంచి క్రిందకు చదవాలి. ఈ శాసనం ప్రస్తుతం విజయవాడలోని అక్కన్నమాదన్న గుహల సముదాయంలో వుంది.

### శాసన పాఠం

**మొదటి ప్రక్క**

1. అర్జునః ఫల్గుణః పార్థః కిరీటి శ్వేతవాహ
2. నః భీభత్సుర్వి జయః క్రిష్ణః సవ్యసాచీ ధనం
3. జయః స్వస్తి శ్రూయతేఖలు ద్వైతవనే పాణ్డవా
4. న్దృష్ట్వా తత్పక్షపాతేన వ్యగ్రో అర్జ్జున ఇంన్ద్రకీలంగత్వా
5. విష్ణణ సాహాయ్యతో తపసా మహేన్ద్ర మారాధ్యతదుప



6. దేశాత్ మహేశ్వర మారాధయతః పాశుపతాస్త్రా
7. ర్థం చాతిగహన మిన్ద్రకీలం అయంయక్షఃశాపా
9. స్తరాత్కలో పెచ్చువాడ కలియమ బోయపుత్రః
10. త్రికోటిబోయి నామధార్మికః ప్రాదుర భూ
11. ద్యఃకర్ణ ఇవ బలపరాక్రమోపేతో వదా
12. వ్యశ్చ। మాతలింప సర్వ కార్య్య కుశలఃస్వా
13. మిభక్తశ్చ। హనూమానివ విదిత జన్మాన్త
14. రావతారో స్వకులో త్తమ చరితశ్చ। సః పూ

## రెండవ ప్రక్క

1. స్వమజ్జన మైత్ర్యాజ్జన్మా న్తర వేదీ తత్పా
2. శుపతాస్త్రా వాప్తికలాన్నిధాన మిన్ద్ర కీలే
3. స్వయశోనిధి మివ స్వకులాభివృద్ధ యే
4. స్తమ్భ మాస్థాపయత్ ఇన్ద్రకీలో గిరి
5. య్యావత్ ద్యావచ్చేయమ్మహానదీ త్రి
6. కోటిబోయుధర్మో యం స్థేయాన్తావ ద్భువేది
7. హ॥ విజయాచార్య్యస్య లిఖితం.

❋ ❋ ❋

# 5. శ్రీఉత్పత్తి పిడుగు

మన రాష్ట్రంలోనే దాదాపు 32 ప్రదేశాల్లో ఇలాంటి శాసనాలు కనిపిస్తాయి. శాసనాలు మూడు, నాలుగు లైన్లు మించి వుండవు. ఒక్క విజయవాడలోనే నాలుగుచోట్ల కనిపిస్తాయి. ప్రస్తుతం అక్కన్న మాదన్న గుహలలోను, మొగలరాజపురం గుహలలోను, కనకదుర్గ అలయ స్తంభంపైన కనిపిస్తున్నాయి. మొగలరాజపురం గుహలో అయితే బొమ్మకూడా వుంది. ఉండవల్లి గుహ ప్రవేశ ద్వారంపైనకూడా చెక్కబడి వుంది. ఇలాంటి శాసనాలు ఎక్కడ వున్నా తప్పకుండా 'శ్రీఉత్పత్తి పిడుగు' వుంటుంది. కన్నడ - తెలుగు మిశ్రమ లిపిలో వుంటుంది.

ఈ మాటకు పండితులు రకరకాల వ్యాఖ్యానాలు ఇచ్చారు. మొత్తంమీద అందరూ శైవమత సంబంధమైనదని నిర్ధారించారు. జైన- శైవ- బౌద్ధ మతాల మధ్య 9-10 శతాబ్దాలలో ఘోరమైన వైరం వుండేది. అవైదికమైన జైన,

బౌద్ధమతాలను అంతం చేయాలని శైవం, శైవాన్ని పరిమార్చాలని బౌద్ధ జైనాలు కంకణం కట్టుకొన్నాయి. అప్పటికే దాదాపు అంతరించిపోయిన ఆ రెండు అవైదిక మతాలను శైవం సులభంగానే మట్టుపెట్టింది.

శైవ మతంలో తొమ్మిది శాఖలున్నాయి. కాలాముఖశైవం చాలా ఉగ్రమైనది. ఒక విధంగా చెప్పాలంటే కాలాముఖ శైవాన్ని ఆధ్యాత్మిక ఉగ్రవాదం అనవచ్చు.

కాలాముఖులు అడవుల్లో మారణాయుధాలు పట్టుకొని తిరిగేవారు. వారికి గదలు లాంటి ఆయుధాలు వుండేవట. బౌద్ధమత చిహ్నాలను నాశనం చేసేవారు. కీలకమైన ఆరాధనా మందిరాలను ఆక్రమించుకొన్న తరువాత తమ ఉద్యమ నినాదమైన శ్రీఉత్పత్తి పిడుగు అనే అక్షరాలు వ్రాసేవారు.

శ్రీఉత్పత్తిపిడుగు ఒక ఆధ్యాత్మిక ఉగ్రవాద ఉద్యమం అనడానికి నిదర్శనంగా వారి నినాదాలు గల ఆరాధనా మందిరాలు విజయవాడలోనే కనిపిస్తున్నాయి. అవి చరిత్రలో ఏదో ఒక ఘట్టంలో బౌద్ధ మత ప్రాముఖ్యం గలవే కావడం గమనించదగిన అంశం. అక్కన్న మాదన్న గుహలపై బౌద్ధ చైత్యం శిథిలాలు, కనకదుర్గ కొండపైన బుద్ధదేవుని పాదాలు, మొగలరాజపురం గుహలపైన బౌద్ధ చైత్యం శిథిలాలు ఇందుకు ఉదాహరణలు.

### శాసన పాఠం

1. శ్రీ ధరయ్య (గోడపైన)
2. శ్రీ ఉత్పత్తి పిడు(గు) (స్తంభముపై)
3. శ్రీ గుణ్డగో శాహిత్య (మరొక స్తంభముపై)

❀ ❀ ❀

# 6. మహాదేవరాజు శాసనం

ఇది విజయవాడ అక్కన్న-మాదన్న గుహల సముదాయంలోగల శిథిలమైన కనకదుర్గ మండపంలో కుడివైపు ముందువున్న స్తంభంపైన చెక్కిన శిలాక్షరాల ఫలకం. తెలుగు - కన్నడ మిశ్రమ లిపిలో వుంది. ఇందులో లభిస్తున్న పరోక్షమైన ఆధారాలను బట్టి 11, 12 శతాబ్దాల నాటి శాసనమని బోధపడుతున్నది. మల్ల వంశపు రాజులలో కొందరు విజయవాడను రాజధానిగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పాలించారు.

అయితే అదే కాలంలో ఏలూరు దగ్గర పెదవేగిని రాజధానిగా చేసుకొని మరొక మహాదేవరాజు పాలించాడు. బెజవాడను పాలించిన మహాదేవరాజు గురించిన ప్రస్తావన నల్లగొండ జిల్లా శాసనాలలోకూడా కనిపిస్తున్నది.

పేరూరు శాసనంలో కనిపిస్తున్న మల్లవంశ మహాదేవరాజు ఖచ్చితంగా బెజవాడ రాజధానిగా చేసుకొని పరిపాలించినవాడే!

మహాదేవరాజు మల్లేశ్వరస్వామి భక్తుడు. జండ్లనావన బోయుడుకి మహాదేవరాజు పెనుగొలను గ్రామంలో పుట్టెడు భూమిని దానం చేశాడు. ప్రతిరోజు మల్లేశ్వరస్వామికి మానెడు నెయ్యి పొయ్యాలని నావనబోయుడికి మహాదేవరాజు శాసించాడు. పేరూరు శాసనంలో పేర్కొన్న మల్లవంశ మహాదేవరాజు బెజవాడలో మహాదేవ సముద్రం తవ్వించాడు. మహాసముద్రం అంటే పెద్ద చెరువు. పేరూరు శాసనంలో చెప్పిన మహాదేవరాజు కూడా మహామండలేశ్వరుడే

### శాసన పాఠం

1. స్వస్తి సమధిగత
2. పంచమహాశబ్ద మ
3. హామణ్డలేశ్వర సి
4. ద్దిపు రవరాధీశ్వ
5. ర మానవ్యస గోత్ర
6. హారితీపుత్ర సోమ
7. వంశార్ణ్నవచంద్రస
8. త్య హరిశ్చంద్ర దళి
9. తరిపు దర్ప్ప వాజి
10. వారన హయ వత్స

11. మల్లవంశసముద్ధరణ భయలోభ సంహారషటు
12. సహస్రావణీవల్లభ శౌర్య్యామిగవల్లభ శ్రీమ
13. న్మల్లేశ్వర దేవదివ్య శ్రీపద పద్మారాధక పరబ
14. ల సాధక నామాది సమస్త ప్రశస్తి సహితులైన
15. శ్రీమన్మ హామణ్డలేశ్వర వెంగి మహాదేవ
16. రాజులు విజయవాడ శ్రీ మల్లేశ్వర శ్రీ మహాదేవర
17. కు అఖండ దీపమునకు నిచ్చినమోదాలు 25 వీనింజే కొ
18. ని జంణ్లనావన బోయుండు తన పుత్రానుపౌత్రి
19. కము నిత్యమానెండు నెయి ఆ చంద్రార్క్కము వో
20. యంగ్గలవాడు। ఈ బోయినికి పెనుంగొల
21. ని భూమి పుట్టెండు॥



❋ ❋ ❋

# 7. పరాంతకదేవర శాసనం

వేంగిదేవ మహారాజు వేయించిన శాసనం క్రిందనే కనిపిస్తున్న 33 పంక్తులుగల శాసనమిది. చాళుక్యరాజైన పరాంతకదేవుడు సింహాసనం అధిష్టించిన ఐదవ సంవత్సరాన్ని పురస్కరించుకొని సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు ఈ శిలాఫలకాన్ని వెలయించాడు. క్రీస్తుశకం 1115వ సంవత్సరంలో చేసిన శిలాప్రకటన ఇది.

శాసనం ఆరవ లైను నుంచి 18వ లైను వరకు, మళ్ళీ 29 నుంచి 31 వరకు అక్షరాలు చెడిపోయినాయి. అయితే ఇది ఆ కాలంలో బెజవాడ మీద అధికారాన్ని విష్ణువర్ధన మహారాజు పరాంతక దేవుడికి కట్టబెట్టాడు. అనగా అప్పుడు బెజవాడ ఆయన ఏలుబడి క్రింద ఉండేదన్నమాట. చాళుక్యరాజ వంశంలోని ప్రముఖులైన పాలకులపేర్లు ఈ శాసనంలో కనిపిస్తాయి. శాసనం వచనంలో ప్రారంభమై పద్యాలతో కొనసాగింది. మళ్ళీ కందపద్యంతో సాగింది. 12వ లైను నుంచి 16వ పంక్తి వరకు కంద పద్యంలో వ్రాశారు. మళ్ళీ వచనంలో సాగింది.

మహామాండలికుడైన బొద్దన ప్రస్తావన ఉన్నది. ఆయన పేరు తరువాత అక్షరాలు చెక్కివేసి ఉన్నాయి. కల్లర్తి, లోకర్తిపల్లి, యలమంద గ్రామాల పేర్లు వున్నాయి. బెజవాడపై పాలనాధికారం పరాంతక దేవుడికి సంక్రమించింది. అసంబద్ధమైన చారిత్రక అంశాలు, వ్యక్తులపేర్లు ఈ శాసనంలో ఉన్నాయి. పైగా ఇందులో కనిపించే వ్యక్తులు విభిన్న కాలాలకు చెందినవారు. పరిశోధకులు కూలంకషమైన అధ్యయనం చేస్తే అద్భుతమైన చరిత్ర వెలుగులోకి వచ్చే అవకాశం వుంది.

భీమన మహామండలేశ్వరుడే కాదు గొప్ప శాసనకవి. భీమన కొండన పేరుతో క్రీ॥ శ॥ 1115 ప్రాంతంలో నేటి గుంటూరు జిల్లా పాములపాడులోని మల్లికార్జునస్వామి ఆలయ స్తంభంపైన వేసిన ఒక శాసనం వుంది. ఆ శాసనంలో ఉత్పలమాల వృత్తంతో ఒక పద్యం వుంది.

ఉ॥ కామనిభుణ్ణ భీమనకుం గామనసాన్కింబుట్టి బంధుచిం
తామణియైన కొణ్ణండు చితంబుగ బాముల పాట సజ్జన
స్తోమనుతిం బ్రతీపకము ధూర్భుడ్‌టికెత్తె నఖండ వత్తిడ్ యు
ద్దామ యశః ప్రకాశి దమ తల్లికిల దండ్రకి ధమ్మడ్ వేర్పడన్

గుంటూరు జిల్లా పాములపాడునే పూర్వం లోకర్తిపల్లి అనేవాళ్ళు. అనేక చారిత్రక అద్భుత విశేషాలుగల ఈ శాసనం ఎందువల్లనో చరిత్రకారులను ఆకర్షించలేకపోయింది.

## శాసన పాఠం

1. స్వస్తి శ్రీ సర్వ్వాలో కాశ్రయ శ్రీ విష్ణువర్ధ్దన
మహారాజులు త్రిభువన చక్రవర్త్తి
2. శ్రీ పరాంత్తక దేవర ప్రవర్ద్ధమాన విజయ రాజ్య
సవంత్సరంబులు 5 గుస్రా
3. హి నకవర్షంబులు 1037 గు నేంటి
మన్మథ సంవత్సరంబున రాజసర్వ్వజ్ఞు
4. ణ్డు జననాథ పురంబున రాజ్యాభివర్ద్ధన కోం
సుఖంబున రాజ్యంబుసేయు
5. చుణి తనయన్వయ కాంపులైనవారి
సకల పరమ వంసోద్భవ భారద్వాజ గోత్రం
6. ట్వాంగ్గధ్వజ వ్రిషభ లాంచ్ఛన
కాంచీపురవరే... పల్లవ కులతి
7. లక పాదంబుజ సేవిత అన్నువ కామకుల... ...నోరి
8. వడి సాహసార్జ్జున సంగ్రామ రామ... ...చాలుక్య
9. నం క్కకాఱ పరమణ్డల చూఱకాఱ పతి... జముణ్డై
10. న శ్రీమన్మహా మణ్డలిక బొద్దన... ...కల్లర్త్తి
11. లోకర్త్తిపల్లి యలమిండ బెజవాడ... ...
12. ॥కంద॥ రాజేంద్రచోడ దేవతనూజు... ...నరపాల సేఖ
13. రునిచే రాజితయశు బేతరాజు... ...లు పాలు
14. కు బేతరాజమహేంద్రుచే నా పురంద్దర... ...తా
15. ఖిల కీర్త్తిచే బెడవాడ రడ్డికమును... ...సలువత్తి
16. ప్రతి ఎన్నికలు ॥వ॥ విసేష పదార్త్థంలు... ...హిమాస్పదు
17. లై మణ్డలిక బొద్దణ్ణునుం దమ్మ... ...
18. కంబురాజ్యంబు సేసి మణ్డలిక బొద్దణ్ణు... ట్టి కలుణ్డు
19. ॥వి॥ అతని తమ్ముణ్ణన్వయ నియత్తల
మిత్రుణ్ణసేషదిక్తట ఖ్యాతయ శోర్త్తి భీమ
20. ణ్డు సుఖస్థితి రా జైయబ్ధివేష్టిత
క్ష్మాతల నాథులెల్ల నరిగాంపుల మాడ్కి
21. న తీఱువెట్ట మాంధాత యయాతి వేణున్రిగ ధమ్మర్
జు లట్లతి ప్రగల్భుంణ్డై
22. ॥గీ॥ పరమహీశులు భక్తులై బంప్పంబనులు
సేయుచుణన్డంగ్గందపను
23. రస్మియునుం గాడ్పు చొచ్చిన నచ్చొన
తన యాజ్ఞ సొచ్చి వెలుంగు భూమియెల్లను
24. బంగ్గెన భీమణ్ణేలె॥ స్వస్తి సమస్త
భువనాస్రయ రాజాధిరాజ రాజపరమే
25. స్వర పరమ భట్టారక రవికుల తిలక
సత్యాశ్రయ వంస్య చాలుక్యా భరణ
26. శ్రీ త్రిభువన చక్రవర్త్తి శ్రీమత్పెమ్మర నడి దేవర
దివ్య సహస్రవర్ష
27. ంబులు 46 గు శ్రాహి శ్రీ వెంగిదేశ చాలుక్య
సంకకాఱ పరమ
28. ణ్డల చూఱకాఱ పతి దేవ గురుద్విజ భక్తులైన
కుఱుమఱజ
29. ముణ్డైన మహామణ్డలిక భీమ....లకు మెచ్చి బెజవాడ
30. రడ్డికంబు దయసేసిన ॥వ్రిత్త॥.... రంబులు రసోదధి
31. వాయు పంథేందు సంఖ్యగా.....న్పెజ
32. వాడరడ్డికం బరిపురభేది రాజపరమాత్మునిచేం
బడసెన్రవీందులు
33. ను ధరణియు నంబురాసులు సదాగతి
మార్గ్గము గల్గు నంత్తకును॥

❀ ❀ ❀

## 8. నాగదేవుని శాసనం

ఇది విజయవాడ మల్లేశ్వరస్వామి ఆలయం శిలాస్తంభంపైన వున్న శాసనం. వాస్తవానికి ఇందులో రెండు శాసనాలు ఉన్నాయి. మొత్తం 23 పంక్తులుగల శిలాఫలకంలో మొదటి 18 లైన్లు ఒక శాసనంగాను మిగిలిన 5 పంక్తులు మరొక శాసనంగాను పరిశోధకులు గుర్తించారు.

మహామాండలికుడైన గుంటూరి బొద్ది నాయకుని కుమారుడు నాగదేవుడు క్రీ॥శ॥ 1131లో వేయించిన శాసనం ఇది.

ఆ సంవత్సరం సంక్రాంతి పండుగనాడు నాగదేవుడు ఆనాటి బెజవాడ మల్లీశ్వరస్వామికి నేటి కృష్ణాజిల్లా ఉయ్యూరు సమీపంలోని వీరవల్లి గ్రామాన్ని ఆలయం అర్చకులకు నాలుగు ఖండికల భూమిని దానంగా ఇచ్చాడు.

18 నుంచి 23 వరకు గల లైన్లలో మన్మరాజు తన తల్లి నరమదేవి, తండ్రి దోరపరాజు జ్ఞాపకార్థం ఒక ఖండి భూమిని ముత్తిరెడ్డి, మల్లిరెడ్డి, ప్రోలిరెడ్డిలకు దానం చేసినట్టు వుంది. ఈ నాగదేవుడే మరో మూడేళ్ళ తరువాత అనగా క్రీ॥శ॥ 1134లో మరో శాసనం వేయించాడు. అది ఇప్పుడు అక్కన్న - మాదన్న గుహల సముదాయంలో ఉంది.

బొద్దయ నాయకుడు బెజవాడను కేంద్రంగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పాలించిన మహామాండలికుడు.

### శాసన పాఠం

1. స్వస్తి సకల పరమ వంశోద్భవ భారద్వాజ గోత్ర ఖట్వా
2. ంగధ్వజ వ్రిషభ లాంచన కాంచీపురేశ్వర కడ్వాఇపతెగోప
3. ఱ పల్లవకులతిలక పదాంబుజ సేవిత అన్నువకామకు
4. లాదినాఅక అనేక బంద్దు జనాశ్రఅ నొడివడి సహసాఙ్ఝ
5. న సంగ్రామ రామ సమరైక భీమ డక్కునూడ్ల శాసన శ్రీ
6. వేంగ్గిదేశ చాలొక్య సంక్క కాఱ పరమండల సూఱకాఱ
7. పతిదేవ గురుద్విజ భక్తులు గుఱుమఱజముండైన
8. శ్రీ మన్మహా మండలిక గొంటూరి బొద్దినా అకు కొడ్కు నాగ
9. దేవండు బెజవాడ ముల్లీశ్వర శ్రీ మహాదేవరకు ఉయ్యూ
10. రి ఒద్ద వీరవల్లి ఆ చంద్రాక్కఁంబుగా నిచ్చితిమి। సకవర్షం
11. బులు 1053 నేంటి ఉత్తరాఅన సంక్రాంత్తి నిమిత్తమున।
12. గ్రామసీమా। పూర్వతః అవసీమాడి। అఞ్జేతః డగ్గుల
13. పల్లముసీమాః దక్షిణతః విద్ధరాజు చెఱ్వు నుత్తరము
14. .... సీమాః । నైరత్యతః మొట్టల కోటం బాసిన వాంగ్గ సీమాః।
15. పస్చిమతః మొట్టల కోటసీమాః। వాయవ్యతః ఆ కుంట సొచ్చిన వా
16. ంగ సీమాః ఉత్తరతః కడకొలని చుఱవుతూప్పూఁ వాంగుసీమా
17. ః। ఇశాన్యతః ఆవంగల అ బాఱినబడిక వాంగసీమాః।
18. కన్నేటి తూప్పూన పూజారులకు ఖ 4 సురపరడ్డి నిచి
19. తిమి రడ్డికంసేను బిమిపుట్టెండు యిచ్చితిమి
20. ఖ 1 మనిక కేతిరెడ్డిని మరి ముత్తిరెడ్డి మల్లిర
21. డ్డి ప్రొలిరడి వేయేల్లఁ పోతిరడ్డిని ఇచ్చితిమి.
22. మన్మరజు తమ తల్లి నరమదేవులకూ తం
23. డ్రి దోరపరజునకూ ధమ్ముఁవుగా నిచ్చె॥

❋ ❋ ❋

## 9. పెనుగొండ వైశ్యుల శాసనం

వైశ్యులు వర్తక వాణిజ్యాలు, సాహిత్య రంగంలోనేకాదు దాన ధర్మాలలో కూడా అగ్రగాములన్నది చారిత్రక సత్యం. పరిపాలనా రంగం కూడా తమదేనని చరిత్రలో ఒకానొక దశలో నిరూపించుకొన్నారు.

వైశ్యులు ముఖ్యంగా నేటి పశ్చిమగోదావరి జిల్లా పెనుగొండను రాజధానిగా చేసుకొని ఆ ప్రాంతాన్ని క్రీ॥శ॥ 1135లో పాలించారు.

అయితే జైనమతావలంబకులు లేదా శైవులుగానే చరిత్రలో నిలిచారు. రామానుజుడు తరువాతనే వైశ్యులు వైష్ణవ మతాభిమానులయ్యారు.

అక్కన్న- మాదన్న గుహల సముదాయంలో ప్రాచీనమైన ఒక మండపం వుంది. అది కనకదుర్గ ఆలయానికి చెందిన శిథిలమైన మండపం.

ఆ మండపం మీద శాలివాహన శకం 1057 చైత్ర బహుళ ఏకాదశి ఆదివారంనాడు వెలయించిన శిలాప్రకటన వుంది. అది పెనుగొండ వైశ్య ప్రముఖులు వేయించినది

నాభిల గోత్రోద్భవుడైన సోమిశెట్టి కుమారుడు బొమ్మసెట్టి. బొమ్మసెట్టికి అయిదుగురు పుత్రులు. వారు సోమిసెట్టి, కొమిరిసెట్టి, అతమసెట్టి, కామిసెట్టి, నామిసెట్టి, ఈ అయిదుగురు వైశ్యులు ఆనాటి బెజవాడలో మల్లీశ్వరస్వామికి అర్చనకోసం 305 గేదెలను దానం చేయడానికి సంబంధించిన శాసనం అది.

ఆ గేదెల నుంచి పాలు, పాల నుంచి పెరుగు, పెరుగు నుంచి నెయ్యి వస్తుంది. ఆ నేతిని మల్లీశ్వరస్వామి అభిషేకానికి ఉపయోగిస్తారు. అది ఏర్పాటు.

ఈ అయిదుగురు సోదరులు కామసాని మారెబోయని కుమారుడు వీరమర....కు ఆ గేదెలను దానం చేశారు. ఆ శాసనంలో దాన స్వీకర్త పూర్తిపేరు తెలియడం లేదు. అక్షరాలు ఎవరో చెక్కివేశారు.

### శాసన పాఠం

1. స్వస్తి। శ్రీ శక వరుషముల్ 1057
2. చైత్ర బ॥ ఏకాదశి ఆదివారాన పెనుగొండ నాభిల
3. గోత్ర సోమిసెట్టి కోడుకు బొమసెట్టి కొడ్కులు సోమి
4. సెట్టి కొమరిసెటి అతమసెట్టి కొమిసెటి నామిసె
5. టి 5రు స్వస్తిశ్రీ చతుర్దశ భువనాదీశ్వరుడైన వి
6. జెయువాడ మల్లీశ్వర శ్రీ మహాదేవరకు అఖ
7. దీపానకుం నిత్యసోలెండు నెయి కామసాని మారెబో
8. ని కొడ్కు వీరమర.... ....పుత్రానపౌత్రికా బు
9. న ఆచంద్రతారకంబు నడపువాండు. ఇ.ఎ 305

❀ ❀ ❀

## 10. శివయోగి శాసనం

శివయోగుల దీక్ష, వ్రత నియమాలను చాటి చెప్పే ఎంతో ముఖ్యమైన శాసనం. క్రీ॥శ॥ 1154లో పుష్కరాల సందర్భంగా శివయోగి మాదయ వేయించాడు. ఆ రోజుల్లో కృష్ణా పుష్కరం వచ్చిన సంవత్సరాన్ని కన్యా బృహస్పతి సంవత్సరం అనేవాళ్ళు. కన్యారాశిలోకి బృహస్పతి ప్రవేశించిన సంవత్సరమన్నమాట. అన్నపానాలు మాని శివునికోసం తపస్సు చేసి దుర్గామల్లీశ్వరుల కళ్యాణం చేయించాడు. ఆ సందర్భంగా గెల్లెనూకబోయని కొడుకు మల్లెబోయునికి 25 ఆవులు దానం చేశాడు. ఆవు పాల నుంచి తీసిన నెయ్యిని మల్లీశ్వరుని అభిషేకానికి వినియోగించాలని శివయోగి శాసించాడు.

### శాసన పాఠం

1. స్వస్తిశ్రీ శకవరుషంబులు 1154 గు నే
2. ణ్టి కన్యాబ్రహస్పతి సంవత్సరమున మేషస
3. ంక్రాంత్తి నిమిత్తంబున శ్రీ చతుర్ద్ధశభువనా
4. ధీశ్వరులైన విజయవాడ శ్రీమల్లేశ్వర శ్రీ
5. మహాదేవరకు ఆచంద్రార్క్క స్థాయిగా నఖం
6. డదీపమునకు సకలశివభక్తవత్సలుం
7. డైన శివయోగి మాదయదేవరలు ని
8. ంద్ర కీలపర్వ్వతమునందు అన్నముడిగి తపస్సే
9. యుచునుండి దేవిదేవరు వివాహముసేసి తమ... ...
10. ట్టి జేగంటధారల సహితము దీపానకు నిచ్చిన మోదాలు 25
11. వీనిం జేకొని సల్లెనూంకనబోయిని కొడ్కు మ
12. ల్లెబోయుండు తన పుత్రాను పౌత్రికము
13. న నిత్యమానెండు నెయి నడపంగలవారు॥

# 11. సంధి విగ్రహి శాసనము

ఈ శాసనం కూడా శిథిల కనకదుర్గ మండపం శిలాస్థంభంపై చెక్కి వున్నది. అందులో 21 లైన్లు వున్నాయి. క్రీ.శ. 1146- ఆ సంవత్సరానికి సమానమైన శక సంవత్సరము 1068 కార్తీక బహుళ ఆదివారం సూర్య గ్రహణం రోజున మహా మాండలిక భీమన వద్ద దౌత్య అధికారిగా పనిచేసిన సోమన ప్రెగ్గడ వేయించిన శాసనమిది. బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీప నైవేద్యాలకు 55 గేదెలు దానం చేసినట్టు వున్నది. ప్రతి గ్రహీత కుమ్మంగురి కామనబోయని మనుమడు ప్రోలయబోయుడు (తండ్రి ప్రోలె బోయుడు). నిత్యం మానెడు నెయ్యి స్వామికి పోయాలని దాత నిర్దేశించాడు. పంచారామాలకు, బుద్ధదేవుడికి, చేబ్రోలులో కుమారస్వామికి, బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపారాధనలు జరిపే ఏర్పాటు సోమనప్రెగ్గడ చేశాడు. గుంటూరులో అనేక చెరువులు తవ్వించాడు. సోమనప్రెగ్గడ ధర్మపరుడని, భారద్వాజ గోత్ర పవిత్రుడని వర్ణించబడినాడు. ఈ ప్రెగ్గడ విదేశీ వ్యవహారాలలో నిపుణుడు. స్వయంగా గొప్ప కవి.

### శాసన పాఠం

1. శ్రీ సకవర్షంములు 1068గు నేంటి కార్త్తిక బహుల ప
2. ంచమియు నాదివారముని సూర్య్య గ్రహణ నిమిత్తమున
3. శ్రీ వేంగ్గీ దేశ చాలుక్య సంకకాఱ పరమండల చూఱకాఱ ప
4. తి దేవగురు ద్విజ భక్తులుం గుఋమఱమ్ముండును నైన
5. శ్రీ మన్మహా మండలిక భీమన సన్థివిగ్రహి సోమన పెగ్గడ బె
6. జవాడ మల్లేశ్వర మహాదేవరకు నఖండ
   దీపమునకు నిత్య నైవేద్యా
7. లకు తావిచ్చిన యిన్నియెడ్లు 55 వీనిం జేకొని కుమ్మంగురి కామ
8. న బోయుని కొడ్కు ప్రోలె బోయుని కొడ్కు ప్రోలయనంది నిత్య
9. మానెండు నెయి యాచంద్రార్కముం బుత్రాను పౌత్రికము నడ
10. పంగలవాండు॥ శ్రీ భీమాపురము
    డాకరేమి వార్కోలను ద్రాచ్యారామపు
11. రి శ్రీమదమరణాలు యను నంధ్రధరణి పంచారామముల మ
12. హా దేవరలకు బుద్ధ దేవరకునుం జేబ్రోల నమ్మహాసేనునకు ను
13. ం బిదపురము హుంకార శంకరికిం గరము రూఢికెక్కిన బెజ
14. వాడ మల్లేశ్వర దేవరకు నఖండదీపతతులు వెట్టి గొంటూకం జె
15. ఱ్వలుం బెక్కుగుడ్లు నిల్పి సప్త సంతతు లసంఖ్యలుగం జేసే దత్తె
16. నామాత్య సోముండు ధమ్మపరుం
    డుదారభానుజుండా చంద్రతారకముగ
17. భారధ్వాజ పవిత్రగోత్రుండు జగత్ప్రఖ్యాతి గాంబెట్టిం బుణ్యా
18. రంభుండొరి గొండివల్లభుండు దత్తామాత్య సోముండు దాక్షారా
19. మప్రముఖోల్ల సత్ప్రకట పంచారామ తీర్థంబులను సారాఖండ
    దశాప్తదీపక
20. ములా చంద్రార్క్క తారంబుగాను ఖండస్ఫుటిత సంస్కారయేః
21. కుర్య్యాత్తు శివాలయే దీపారామ తటాకేమలభతే మౌలికం ఫలం॥



# 12. సోమన ప్రెగ్గడ శాసనం

ఇది 12 లైన్ల శాసనం. అక్కన్నమాదన్న గుహల సముదాయంలోని శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వుంది. క్రీ॥శ॥ 1155లో బెజవాడ పాలకుడైన మహామండలేశ్వర బొద్దన నారాయణుడి ప్రధాన మంత్రి సోమనప్రెగ్గడ వేయించిన శాసనం. సోమనప్రెగ్గడ బెజవాడ మల్లీశ్వరస్వామికి నిత్యం

దీపారాధన చేసే బాధ్యతను ఎరయబోయడు అనే వ్యక్తికి అప్పగిస్తూ అందుకు అవసరమైన 55 గేదెలు దానం చేశాడు. ఈ సోమన(ప్రెగ్గడ వేయించిన శాసనాలు విజయవాడలోనే ఇంకా మూడు ఉన్నాయి. ఆయన దానగుణంలో దధీచిలాంటివాడు. సప్త సంతానాలలో ప్రధానమైన చెరువులు తవ్వించాడు. స్వయంగా గొప్ప కవి. ఆయన గొప్పతనాన్ని అభివర్ణించే పద్యాలు రెండు.

"భారద్వాజస గోత్ర పవిత్రుణ్ణు జగత్ప్రఖ్యాతిగాంబెట్టెం భూ (హారా) భుం డ్డొరగాండి వల్లభుండు దత్తామాత్య

సోము దాక్షారామ ప్రముఖోల్ల సత్ప్రకట పంచారామ తీర్థంబులను సారాఖండ దశాస్తపదీకము లా చంద్రాక్కన్ తారంబుగాన్

ఉ॥దాన దధీచి సోముండవతాతయః ప్రసాదుణ్ణు పుత్రసం తాన ప్రమృద్ధుండై చెఱ్వు ధమ్మన్ వివాహము దేవగేహ(ము) వనము సత్ప్రబంధము నిధానమనంజనుచున్న సప్తసం తానములుం బ్రసిద్ధముగ ధారుణిపై నిలిపెం గ్రమంబునన్

ఈ పద్యాలు శాసనంలోనివి కాకపోయినా ఆయనే మరికొన్ని శాసనాలలో వ్రాసిన పద్యాలను బట్టి ఆయన కాలంలో సంతానంతోపాటు చెరువు తవ్వించటం, పెళ్ళిళ్లు చేయించడం, గుడులు కట్టించటం, ఇళ్ళు నిర్మించి ఇవ్వడం, తటాకాలు తవ్వించడం, మంచి ప్రబంధాలు వ్రాయించటం కూడా సప్త సంతానాలుగా పెద్దలు చెప్పినట్టు బోధపడుతుంది.

### శాసన పాఠం

1. స్వస్తిశ్రీ శకవర్షంబులు 1077 గు
2. నేంటి పౌష్య మాసమున ను త్తరాయణ సం
3. క్రాంత్తి నిమిత్తమున శ్రీ మన్మహా మండలిక
4. బొద్దన నారాయణదేవని ప్రధాని సోమన
5. పెగ్గడ దత్తన బెజవాడ శ్రీ మల్లేశ్వర మహా
6. దేవరకు నఖండ దీపమునకు నిచ్చిన ఇను
7. పెడ్లు 55 వీనింజేకొని యెఱియ బో
8. బోయుండు నిత్య మానెండు నెయి పు
9. త్రాను పౌత్రికము ఆసంద్రార్కంముం బోయంగ్గల
10. వాండు॥ ఖండస్ఫుటిత సంస్కారం యోః కుర్యాా
11. తు శివాలయే। దీపారామ తటాకేషు లభతే
12. మౌళికం ఫలకం॥

❀ ❀ ❀

## 13. అల్లుదేవరాజు శాసనం

పన్నెండు పంక్తులుగల ఈ చిన్న శిలా ప్రకటన మల్లీశ్వరాలయ మండపం పైకప్పుమీద తాపటం చేసి వుంది. చాలా అక్షరాలు శిథిలమైనా కూడపలుక్కొని చదివితే చాలా గొప్ప శాసనమని బోధపడుతుంది. క్రీ॥శ॥ 1276లో బెజవాడ మహా మండలేశ్వరుడు త్యాగిపోతరాజు పేరుగల శాసనం. మల్లీశ్వరస్వామికి నోచిండ్లపాటి బోయడు ప్రతిరోజు మానెడు నెయ్యి స్వామికి సరఫరా చెయ్యాలని దాత అల్లుదేవరాజు శాసించాడు. అల్లుదేవరాజు అనే పాలకుడు బెజవాడ పరిసరాలలో ఏదో ఒక ప్రాంతానికి పాలకుడుగా వుండేవాడని ఈ శాసనం వల్ల బోధపడుతున్నది.

### శాసన పాఠం

1. శ్రీ స్వస్తి। శ్రీ శకవర్ష-
2. (1) 198 గు నేంటి...
3. -- బహుల దశమి-
4. రు వారమున స్వ...
5. హా మండలేశ్వర చాగి పో-
6. -- ణము అల్లు దేవరాజు...
7. -- మల్లేశ్వర శ్రీ మహాదేవ...
8. --మునకు నిచ్చిన మో...
9. --కొని నొంచిడ్లపాటి...
10. --బోయుండు ఆ చంద్రా--
11. -- ను పౌత్రికము నిత్తె మా...
12. --పం గలవాండు॥

# 14.కంటమ శాసనం

ఈ శాసనం మల్లీశ్వరస్వామి ఆలయం ఉత్తరద్వారంవైపు మండపంలోగల స్తంభంపైన ఉన్నది. మొత్తం 12 లైన్లు ఉన్నాయి. శక సంవత్సరం 1075 నాటిది. అనగా క్రీ. శ. 1153లో బెజవాడను బొద్దన నారాయణుడు అనే మాండలికుడు పరిపాలించాడు. ఆయన దగ్గర నాగార్జునుడు అనే కోశాధికారి ఉండేవాడు. ఈ నాగార్జునుడి అత్తగారి పేరు కంటమ్మ. ఈమె పేరుతో పశ్చిమగోదావరి జిల్లా పెనుగొండలో కూడా ఒక శాసనం ఉంది. ఆమె మహా శివభక్తురాలు. శివయజ్ఞము జరిపించినట్లు పెనుగొండ శాసనంలో వుంది. శివ యజ్ఞమేమిటో పూర్తిగా బోధపడకపోయినప్పటికి అది వీరశైవ సంప్రదాయానిదై ఉండవచ్చు. ప్రస్తుత శాసనం ప్రకారం కంటమ్మ మల్లీశ్వరునికి అఖండ దీపారాధన కోసం 55 గేదెలు దానం చేసింది. ఈ దానాన్ని కామనబోయుని కొడుకు బ్రమ్మన బోయుడు తీసుకొన్నాడు. బ్రమ్మన నిత్యం స్వామికి నెయ్యి అందచేయాలి. ఈ దాన పాలన ఆచంద్రతారార్కం జరగాలని దానకర్త ఆశించాడు.

ఈ శాసనంలో విచిత్రమైన అంశం శాసనం రెండవ లైనులో "ఏలునయనిధి" అన్నమాటకు సరియైన వివరణ తెలియరావడంలేదు. రాజనీతి దురంధరుడు కావచ్చునని కొందరు పండితుల అభిప్రాయం. శాసనమంతా పద్యంలో ఉంది.

## శాసన పాఠము

1. శరగిరి గణేందు సమ్మిత సకరాజవత్సరం
2. బులబెజవాడ ఏలువయనిది బొద్ధన నారాయ
3. ణుని ధనాధక్షి నాగార్జునుం డతని అత్తగంట
4. మ నిజకులకమలినీ కలహంస గుణగణాలం
5. క్రిత గోరి నిల్పె మల్లేశ్వరునకు సామజ దైత్య చర్మాౕ
6. ంబరున కద్రికన్యావరునకు లలితఖండ శశిధరున
7. కఖండ దీపజ్వాల ఒనరి యొప్పలీలందనరి వెలుం
8. గ నచ్చౕలిచ్చి కొల్వననిరతభ క్తినా చంద్రతారము
9. గం బ్రశస్తముగాను (1) కంటమ ఇచ్చిన ఇన్పఎడ్లు 56
10. వీనింజేకొని కామన బోయిని కొడ్కు బ్రమ్మన ఆ
11. చంద్రార్కౕము నిత్యమానెండు నెయి వో
12. యంగ్గలవాండు॥



ఇది ప్రతాపరుద్ర మహారాజు వేయించిన శాసనం. బెజవాడ కనకదుర్గ శిథిలమండపంపై ఉన్నది.

# 15. ఈశ్వరభట్టు శాసనం

ఇది కూడా అక్కన్నమాదన్న గుహాల సముదాయంలో కనకదుర్గ మండప స్తంభంపైన గల శాసనం. ఇరవై పంక్తులు ఉన్నాయి.

క్రీ॥శ॥ 1165 ప్రాంతంలో అప్పటి బెజవాడ ప్రాంతానికి పాలకుడు చెంగయ నాయకుడు. ఆయన మహా మాండలికుడు. ఆయన గురువు ఈశ్వరభట్ట సోమయాజులు. బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపారాధన కోసం ప్రతిరోజు మానెడు నెయ్యి అవసరం. నెయ్యి అందజేసే నిమిత్తం కావనబోయని కుమారుడు చెందుల బోయనికి 55 గేదెలు దానం చేశాడు.

ఈ దానం శక సంవత్సరం 1087 అనగా క్రీ.శ. 1165లో వచ్చిన ఉత్తరాయణ సంక్రాంతినాడు తన పుణ్యంకోసం మల్లీశ్వరస్వామికి ఈ దానం చేశాడు. ఈ దానం ఆ చంద్రతారార్కం చందులసోమె తరతరాలుగా కొనసాగించాలని దానకర్త శాసించాడు.

చంగయ నాయకుని గురువు యజ్ఞముచేసి సోమయాజి అయినట్టు పేరునుబట్టి విదితమౌతున్నది. ఈ చంగయ నాయకుడు గుంటూరు- బెజవాడ మధ్య ప్రాంతానికి పాలకుడై వుండవచ్చును. ఇందుకు ఉపపత్తి పాత గుంటూరులో నల్లశాణాంబ గుడి వద్ద లభించిన శాసనంలో లభిస్తుంది.

ఈ శాసన కాలంనాటి నైష్ఠిక బ్రాహ్మణుల పేర్లలో ద్వితీయావయవం ప్రెగ్గడ లేదా భట్టు. ఇది బిరుద వాచకమే.

## శాసన పాఠం

1. స్వస్తి శ్రీ సకవర్షంబు
2. లు 1087 నేంటి యుత్తరా
3. యణ సంక్రాంత్తి నిమిత్య
4. మున శ్రీమన్మహా మం
5. డలిక లింగయనాయకు
6. ని గురులు గుముడూరి
7. యీశ్వరభట్ట సోమయా
8. దులు బెజవాడ శ్రీమ
9. ల్లేశ్వర మహాదేవరకు
10. నఖండ దీపమునకు నిచ్చి
11. న యిన్నఎడ్లు 55 వీనింజే
12. కొని కావనబోయిని కొ
13. డ్కు చెందుల సోమె నిత్య
14. మానెండు నెయిపుత్రాను
15. పౌత్రికముగా నాచంద్రార్క్క
16. ముం బోయం గలవాండు॥
17. స్వదత్తం పరద'త్తం వ్వాంయోహ
18. రేతి వసుంధరాం పుష్టిం వర్ష
19. సహస్రాణి విష్టాయాంజాయ
20. తే క్రిమిః॥



## 16. సూరపరెడ్డి శాసనం

మల్లేశ్వరస్వామి ఆలయం తూర్పు ద్వారం కుడివైపున గోడకు తాపటం చేసిన 20 పంక్తులు గల శాసనం ఇది.

క్రీ॥శ॥ 1190లో బెజవాడను రాజధానిగా చేసుకొని చాగి దొరయరాజు ఈ ప్రాంతాన్ని పాలించాడు. అయితే ఈయన త్యాగిపోతరాజుకు సామంతుడుగా మహామండలేశ్వరుని హోదాలో పరిపాలించాడు.

దొరయరాజు దగ్గర గంధసిరి బొల్లిరెడ్డి అనే గొప్పవ్యక్తి వనిచేసేవాడు. ఆయన కుమారుడు సూరపరెడ్డి. మల్లేశ్వరస్వామికి అఖండ దీపారాధన చేసే బాధ్యతను లక్ష్మ సాయిబోయని కొడుకు న్యూసుదె బోయనికి అప్పగిస్తూ ఈ శాసనం వేయించాడు. సూరపరెడ్డి, న్యూసుద బోయడు ఆ చంద్రతారార్కం వంశపరంపరగా ప్రతిరోజు సాంబాటి మానిక నెయ్యిదానం చెయ్యాలి. అందుకోసం న్యూసెమబోయనికి 25 ఆవులు దానం చేశాడు.

ఈ శాసనం 13 లైను నుంచి సంస్కృతంలో వుంది.

### శాసన పాఠం

1. శ్రీ శకవర్షంబులు 1112 నేంటి మా
2. ఖ మాస బహుల చతుర్దశియు శు
3. క్రవారమున శ్రీ మన్మహా మండ్లె
4. లేశ్వర చాగిరోరయ రాజుల బంట్టు
5. కొన్నాతాడి గంధసిరి బొల్లిరడ్డి కొడుకు
6. సురపరెడ్డి శ్రీ విజయవాడ మల్లేశ్వర మ
7. హాదేవరకు అఖణ్డదీపముకు
8. ఆచంద్రార్కస్థాయిగాం బెట్టిన మోదా
9. లు 25 వీనిం జేకొని లక్ష్మమ
10. సాయిబోయుని కొడ్కు న్యసూదెబ్రమ్మల సాంబా
11. టి మానిక మానెండు నెయి నిత్యము
12. ం బుత్రానుపౌత్రిక మాచంద్రార్కము
13. నడపంగలవాణ్డు॥ శాకాబ్దేక
14. రశంక్కరేందు గణితే మా ఘేచ ప
15. క్షే సితే తీరే భూతతిథౌ సురేశ
16. నిలయే క్రిష్టాపగాయాశ్శుభే ప్రా
17. దాద్దీప మఖణ్డ మత్ర విమలం
18. మల్లేశ్వరాయ ప్రియే వాటాయాం వి

❋ ❋ ❋

## 17. త్యాగిపోతరాజు శాసనం

బెజవాడ మల్లీశ్వరస్వామి మండపం పైకప్పుకు తాపటం చేసిన శిలపై చెక్కిన శాసనమిది.

క్రీ॥శ॥ 1197లో ఈ ప్రాంతాన్ని త్యాగి వంశం పరిపాలించింది. ఆ వంశంలో ప్రముఖులైన పాలకులపేర్లు ఇందులో కనిపిస్తాయి. శాసనం వేయించింది త్యాగిపోతరాజు. ఆయన కొంతకాలం కృష్ణాజిల్లా నందిగామను రాజధానిగా చేసుకొని పాలించాడు. కొంతకాలం బెజవాడ ఆయనకు రాజధాని. 1119లో మల్లీశ్వరస్వామికి హవిబలిర్దానాల కోసం నోచిండ్ల, జక్కంపూడి గ్రామంలో మూడింట రెండు వంతులు దానం చేశాడు. వేదాద్రి నరసింహస్వామికి కూడా కొన్ని దానాలు చేశాడు.

జక్కంపూడిలో ఒక వంతు రాజనారాయణస్వామి ఆలయానికి దానం చేశాడు. శాసనం 36వ లైన తరువాత ఏమైందో తెలియదు.

త్యాగి వంశంలో గొప్ప పాలకుల వంశక్రమం ఇందులో వుంది.

### శాసన పాఠం

1. స్వస్తి శ్రీమతి త్యాగి వ
2. ంశే అరయ ధరణీపతి
3. న్నా్మ విజితతరణీ తనయ
4. వితరణ విలాసో బభూవ

5. తస్య తనయస్త్యాగీరోర వసు
6. ంధరావల్లభః। తస్యతనూ
7. జస్త్యాగ సత్యశౌర్య్యాదిగు
8. ణ మణివిభూషితః। పోతమ
9. మహీపతిః। తస్య పుత్రో నిజకు
10. ల జలనిధి రజని కరో నాతవా
11. టీ విషయాధీశ్వర స్త్యాగి రాజః
12. పంచదశవర్షాణి విజయ
13. వాటి కాం ధర్మ్మ మార్గ్గేణ కళాస
14. తస్య తనయః శ్రీ యోగానంది
15. నరసింహ దేవదివ్య శ్రీపాద
16. పద్మారాధక శ్చతు ర్వ్విధ పురుషా
17. ర్థ సాధకః శ్రీ నరసింహవర్ద్ధన
18. స్త్యాగిపోత ధరణీపతి ర్నవేశశశి
19. 1119 మిత శకవత్సరే రాజ్య
20. పదస్థో నాత వాటి విషయే చ బహూన్
21. విజయ వాటీ విషయే చ బహూన్
22. పుణ్యా నగ్రహారాన్ దత్వాప్రతి
23. పాల్యచ మల్లీశ్వర శ్రీ మహాదే
24. వస్య హవిర్బ్బల్య చ్చనార్థంనా
25. ంచిడ్ల గ్రామం జక్కమ పూ
26. ండి గ్రామే భాగద్వయం స
27. మర్ప్యతత్రైన ఏకం భాగ
28. ం రాజనారాయణ దేవస్య
29. సమర్ప్య గోగ్రాసార్థం
30. గోరాంలకాంచ దత్వా
31. మల్లేశ్వర మ... ...
32. శిలాప్రా.... ....
33. తస్యైవ
34. దేవరా... ....
35. స్వప్రాద... ....
36. కాదల.... ....



## 18. పోతక్షితీశుని శాసనం

ఇది కనకదుర్గ శిథిల మండప స్తంభంపైన గల 26 లైన్ల శాసనం. శాలివాహన శకం 1121 సంవత్సరం సంక్రాంతి పడగనాడు అనగా క్రీ॥శ॥ 1199లో త్యాగివంశపురాజు పోతరాజు వేయించాడు.

ఆ రోజుల్లో కొండ అంటే కనకదుర్గ కొండ. ఈ కొండకు పడమరవైపునగల జక్కంపూడి గ్రామంలో ఒక వంతు రాజనారాయణస్వామికి దానం చేస్తూ త్యాగిపోతరాజు వేయించిన శాసనం ఇది.

### శాసన పాఠం

1. ఆసీద్దు ర్జయ వంశాబ్ధి రరాయో హరివి
2. క్రమః ప్రాగీశ సద్రిశః శ్రీమాం పశ్చిమాధీ
3. శ్వరోపమాః॥ (1) తస్యాన్వవాయ ధభవత్ధీమాన్
4. ధోరమహీపతిః తస్యపుత్రోభవ ద్రాజా
5. భీమోభీమ పరాక్రమః (2) తస్యభ్రాతాత్మ జో
6. వీరస్త్యాగీ భోగపురంధరః శశాస నగరీం జి
7. ష్ణోర్న్నందన స్యేహ సర్వ్వదః (3) తతః స్తస్యానగ్ర జాద్భీమవు
8. త్రాద్వోరం ద్రిపాద్భువి జాతవాన్ పోతభూపాల స్త్యాగసాన
9. రచంద్రమాః॥ (4) సుశాస్త్రాభవ దైంద్రస్య ననగరీం ద్ధర్మ్మా త
10. త్పరః బ్రహ్మణ్య స్తత్వ త్ర్పాజ్ఞశూర రాడిభ కేసరీ (5)
11. స్వ వంశరక్షైవిధయే విచార్య్యా యంస్వయంసముత్పాద్య
12. సు నిర్వ్విః తస్వభూః సమాశ్రయంచ్ఛాప్య భయం వ్రి షస్తథా
13. యోధా చతుర్భిశ్చరణైః ప్రతిష్ఠితః॥ (6) శ్రీ శాకాబ్దే
14. ధరిత్రీ నయనగరిసుతాధీశ సంఖ్యేర్జ్ఞానస్య పుయ్యా
15. ం మల్లేశ్వ రాయాఖిల గురగురవేక్కా క్రియోసం ప్రయాతి।
16. గ్రామం ధాత్ర్యా సుసారం త్రిభువన నుతయే క్లేశకన్యా
17. భిధేయం ప్రాదాత్త్రీ ధోరభూపాగ్రజ పరతనయస్త్యాగి పోత
18. క్షితీశః ॥ (7)
19. స్వస్తి శకవర్షంబులు 1121 గు నేంట్టి విశుమ సంక్రాంతి
20. నిమితమున బెజవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు శ్రీమ
21. ను మహామండలేశ్వర చాగి పోతరాజులు
22. ఆచంద్రతారార్కముగాం కొండ పడ్మటీ ప్రాంత జక్క
23. మపూండి అందు రెండు వాడ్లును నొంచ్చెల్లపుర
24. మును సున్నమునకు నిచ్చితిమి॥ ప్రాం త్తజంక్క
25. మవుండి అంద్దు ఒక్కపాలు రాజ నారాయణదేవరకు
26. నిచ్చితిమి॥

❀ ❀ ❀

## 19. నెగడాలవారి శాసనం

ఇది కూడా శిథిల కనకదుర్గ మండప స్తంభంపైనగల శాసనం. క్రీ॥శ॥ 1213లో సంక్రాంతి పండగనాడు వేయించిన శాసనం ఏడులైన్లు ఉన్నాయి.

నెగడాల అన్నిసెట్టి తన తల్లి బొల్లసాని, తండ్రి ఎర్రమసెట్టికి సద్గతులు కలగాలని మల్లీశ్వరస్వామిని ప్రార్థిస్తూ 25 ఆవులు పియకొమ్మన బోయుడికి దానం చేశాడు. ఆవు నెయ్యితో మల్లీశ్వరస్వామికి దాన గ్రహీత ప్రతినిత్యం అభిషేకం చెయ్యాలని ఆయన కోరిక.

నెగడాల ఇంటిపేరుగల వారికి పగడాల వారనే పేరు కూడా ఉంది. మల్లీశ్వరస్వామి ఆలయ మండప స్తంభాలను పగడాలతో తాపటం చేసిన కారణంగా ఆ వంశానికి పగడాల పేరు వచ్చిందని పగడాల వారి వంశ కథనం. తాపటం చేయించి గొప్పతనం కోసం వంశనామాన్ని 'పగడాల'గా మార్చారని కులదేవతలు, వంశంలోని పితృదేవతలు ఆగ్రహించారని కథనం.

ఇంటిపేరు మార్చుకొన్న తరువాత వారికి అన్నీ నష్టాలే వచ్చాయట. దానితో భయపడి తిరిగి నెగడాలగా పేరు మార్చుకొన్నారని ఆ వంశీకులు చెబుతారు.

### శాసన పాఠం

1. స్వస్తిశ్రీ శకవర్షంబులు 1135 గు నేం
2. టి మేష సంక్రాంత్తి నిమిత్తమున నెగడాల అన్ని
3. సెట్టి తమ తండ్రి ఎఱమసెట్టికి తమ తల్లి బొ
4. ల్లసానికి ధర్మువుగా అఖండదీపమునకు నిచ్చినమో
5. దాలు 25 వీనినిజేకొని పియకొమ్మన బోండు తనవు
6. త్రానుపౌవిత్రికమున నిత్య మానెండు నెయి పోయం
7. గ్గలవాండు ఇబోయనికిం నావు లూరభూమి న 10.

# 20. భీమరాజు శాసనం

ఈ శాసననాన్ని 1877లో అప్పటి కృష్ణా జిల్లా కలెక్టర్ రాబర్ట్ స్యుయెల్ కనుగొన్నాడు. మల్లేశ్వరాలయం ప్రాంగణంలోని విఘ్నేశ్వరాలయకప్పుకు తాపటం చేసి వుంది. క్రీస్తు శకం 1213వ సంవత్సరం కొనకంద్రవాటి సీమ పాలకుడైన భీమరాజు వేయించిన శాసనమిది.

సంస్కృతం తెలుగు భాషలలో ఈ శిలాప్రకటన జరిగింది. ఆ నంవత్సరం నంక్రాంతి పండగనాడు మల్లీశ్వరసామికి అఖండ దీపారాధన కోసం 25 ఆవులు ఒక ఆంబోతును భీమరాజు దానం చేశాడు. మల్లీశ్వరస్వామి పేరిట కొండెబోయడు దానం స్వీకరించాడు.

కొండెబోయడు ప్రతిరోజు స్వామికి మానెడు నెయ్యి అందచేయాలని ఈ పద్ధతి తరతరాలుగా కొనసాగించాలని భీమరాజు శాసించాడు.

త్రికోణాకృతిగల పెద్ద శిలపై చెక్కిన ఈ శాసనంలో మొత్తం 62 పంక్తులు ఉన్నాయి., మొదటి ప్రక్క 24, రెండవ ప్రక్క మొదటి అయిదు లైన్ల వరకు సంస్కృతంలోను, ఆరో పంక్తి నుంచి రెండవ ప్రక్క పూర్తిగాను, మూడవ ప్రక్క తెలుగులోను లిఖించారు. ముఖ్యంగా మూడవ ప్రక్క బిరుదులులతో నిండివుంది.

భీమరాజు దుర్జయ వంశానికి చెందినవాడు. ఆ వంశానికి చెందిన వీరచోడభూపతి త్యాగి పోతరాజు (త్యాగి వంశానికి మూలం దుర్జయ వంశం కావచ్చునని కొత్త భావయ్య చౌదరిగారు అంటారు) దుర్జయ వంశానికి చెందని భీమరాజు విజయవాడ రాజధానిగా చేసుకొని 330 గ్రామాలను పరిపాలించాడు. ఈయన పరమ శివభక్తుడు.

ఈయన బిరుదులు కళ్ళు చెదిరిపోయేటంతగా వున్నాయి. అయినా విజయవాటికాపురాన్ని కేంద్రంగా చేసుకొని పరిపాలించిన ప్రాంతమంతా కేవలం మూడువందల పై చిలుకు గ్రామాలు మాత్రమే.



# శాసన పాఠం

మొదటి ప్రక్క

1. ఆసీద్దుజ్జర్జయ
2. వంశవార్ధ్ధి రజనీనాథస్సు
3. ధా సంస్థితః శ్రీమద్దుజ్జర్జ యపోత
4. భూపతిలకః సౌఖ్యైరమాభీప్సితః
5. । ప్రాగీశాప్పిర్జతచక్రవర్తిర్జవి
6. భవః కీర్త్యర్జ ంగనామంగ
7. ళః శ్రీ వేంగీ విషయాంగనా
8. సురమ రమణ స్సౌజన్య
9. రత్నాకరః (1) తస్సాన్వవాయా
10. త్సంజాతీ వీరచోడక్షితీశ్వరః ।
11. రాజేంద్రేఅహవిఖ్యాతః కోన
12. కంద్రాడివల్లభః ॥ (2) తస్యాత్మ
13. జోభవచ్ఛూరో భీమో భీమ
14. పరాక్రమః శశానకారోః పు
15. త్రస్య నగరీంసు మనోరమా
16. ం ॥ (3) తస్య పుత్రో భవద్ధాత్ర్యా
17. ం శరణాగత వత్సలః । విద్వ
18. జ్జన మనోంభోజ సప్తాశ్వ శ్చేడ భూ
19. పతిః॥ (4) తస్య పుత్రో భవద్ధీమాన్ శివ
20. భక్తి పరాయణః । త్యాగి పోతా
21. ధిపఃశ్రీ మద్భోగసంవర్ధర్జ నానుజః
22. (5) నయశాస్త్రార్థర్జ తత్వజ్ఞో వ
23. య్త మాంబా సునందనః సూ
24. రపోతాధిప... ...

రెండవ ప్రక్క

1. సు విమలం ధైర్యార్జమరా ద్రిర్బిర్జశం॥
2. భీమసోమ పదాబ్జ మత్తమధుపః
3. శ్రీ చోడ భూపాత్మజః। ప్రాదార్దీ
4. ప ముఖండవర్తిర్జ తశిఖం మల్లేశ్వరా
5. యక్షితౌ (7) మల్లేశ్వర దేవాయ
6. నమః ॥ స్వస్తి సమధిగత పరమ
7. మాహేశ్వర నిజఅవాటికా పురేశ్వ
8. ర త్రిసప్తతి గ్రామాధీశ్వర చా
9. లుక్యకుల వల్లభ ప్రాసాదలబ్ధ రా
10. జ్య పదవీ విరాజమాన విక్రమభీమ
11. అభినవ రామ చాలుక్య కటకన బ్ర
12. ప్రాకార పరాంగ్గనాదూర దాఅవె న్నెఱ్జ
13. గుణ రాచగుడియ అరిగిరికులిశా
14. యుధ శౌర్యర్జ చక్రాయుధ ధైర్యర్జ
15. నాగేంద్ర విభవ మహేంద్ర దుజ్జర్జయకు
16. లార్జ్జున పరహిత భాషణ పతిహిత
17. భూషణ సాహససూద్రక వైరిరాజ
18. న్య ముఖముద్రక వానరాఅతారక ష
19. దానన యిరుగ మదేభ పంచానన
20. వినోద విద్యాధర వీర వ్రికోదర అం
21. ద్రమండల మాణిక్య య్యుపా
22. య చాణాక్య యుదార దధీచి కాం
23. చ్చీసుధారోచి చౌవులిక సేనాంబుధర ప్రల
24. య వాతూల శత్రుంద్రి పాలఖీల దుగ్గనన
25. రేంద్ర ధూఱ పండియ వినిర్జిత శౌవు
26. చ మహావ్రత బుద్దవమ్మార్జ న్వయవిద్వ

మూడవ ప్రక్క

1. స్వస్తి । సకవషర్జంబులు 1135గు నేంటి మే
1. ష సంక్రాంత్తి నిమిత్యమున బెజవాడ
3. మల్లీశ్వర శ్రీ మహాదేవరకు అఖం
4. ండదీపమునకు కోనకంద్రాడి భీమ
5. రాజులు ఇచ్చిన మొదవులు 25 ఆ
6. ంబోతును నిచ్చితిమి। వీనింజేకొని
7. కొండెబోయుండు తన పుత్రాను
8. పౌత్రికము ఆచంద్రార్కర్జము ని
9. త్యమానెండు నెయి నడపం గలవా
10. రు నింగి మిట్టుల పల్లమున బోయి
11. న్కిభూమి న 10(8)

# 21. దుర్జయుని శాసనం

ఇది కూడా దుర్జయ వంశానికి చెందిన శాసనమే. ఇందులో దుర్జయ వంశానికి చెందిన నరేంద్ర భూపతి ప్రస్తావన వుంది. ఇది అసంపూర్ణ శాసనం. ఈయనకు రాజధాని విజయవాటికాపురం



## శాసన పాఠం

1. స్వస్తీసమధిగత పంచమహాశబ్ద మహా
2. మండలేశ్వర పరమ మాహేశ్వర విజ
3. యువాటికా పురేశ్వర త్రిసప్తతి గ్రామాధీశ్వ
4. ర చాలుక్యకుల వలభ ప్రాసాదలబ్ధ
5. రాజ్యపదవీ విరాజమన విక్ర
6. మ భీమ అభినవ రామ చా
7. లుక్యకటక వజ్ర ప్రాకార పరాంగ
8. నా దూర దాయనెన్నడ్వ గుణరా
9. చగుడియ అరిగిరి కులశాయు
10. ధశౌర్య్గ చక్రాయుధ ధౌర్య్గ నాగేం
11. ద్ర విభవ మహేంద్ర దుర్జయ కు
12. లార్జున పరహిత భాశాశాణ పతిహి
13. తభూషణ సాహససూద్రక వైరిరా
14. జన్య ముఖముద్రక వానరాయ తా
15. రక షడానన ఈరుగ మదేభవం
16. చానన వినోద విధ్యాధర వీరవ్రికోదర
17. అంధ్ర మండల మాణిక్య యుపాయ
18. చాణాక్య యుదార దధీచి కాంచీ సుధారో
19. చి చౌవుళిక సేనాంబుధర ప్రలయవా
20. తూల శత్రుంద్రి పాలబీలదుర్గ నరేంద్రచూ
21. అ పండియ వినిర్జిత శౌవు చమహావ్ర

❀ ❀ ❀

# 22. రాయనప్రెగ్గడ శాసనం

1877లో కృష్ణా జిల్లా కలెక్టర్ రాబర్ట్ స్యుయెల్ ఈ శాసనాన్ని కనుగొన్నాడు. అక్కన్న మాదన్న గుహల సముదాయంలోగల శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వుంది. క్రీస్తుశకం 1216లో రాయనప్రెగ్గడ వేయించిన దాన శాసనమిది. ఆ కాలంలో గుంటూరు ప్రాంతానికి చెందిన గొంటూరు రాజవంశానికి చెందిన ఒదయరాజు బెజవాడను రాజధానిగా చేసుకొని పాలించాడు. ఆయన దగ్గర సమస్త సేనాధిపతిగా పనిచేసిన వాడు రాయనప్రెగ్గడ. బెజవాడ మల్లీశ్వరస్వామికి అఖండ దీపారాధనకు అవసరమైన నెయ్యి ప్రతిరోజు అందజేయాలన్న నియమంతో 55 గేదెలు వేలేటి మల్లెన బోయెడికి రాయనప్రెగ్గడ దానం చేశాడు. ఆ రోజులు సాన్వెంపాటి మానిక అనే కొలపాత్ర ఉండేది. ఆచంద్రతారార్కం ప్రతిరోజు మానెడు నెయ్యిస్వామికి అందజెయ్యాలి. వేలేటి మల్లెనబోయడు ఈ సంప్రదాయాన్ని తరతరాలుగా కొనసాగించేట్టు చూడాలని రాయనప్రెగ్గడ ఆంక్ష విధించారు. రాయనప్రెగ్గడ వంశం గురించి ఈ శాసనంలో ఉంది. నేటి పశ్చిమగోదావరి జిల్లా వేంగి గ్రామ వాస్తవ్యుడు కళ్యాణదేవుడు. కౌశిక గోత్ర బ్రాహ్మణుడు. మంత్రి పదవి అలంకరించినవాడు. ఆయన భార్య బొల్లమాంబ. ఆయన కుమారుడు రాయన మంత్రి. మంత్రి పదవి చేపట్టిన బ్రాహ్మణులకు జాతక నామం తరువాత గౌరవ సూచకంగా 'ప్రెగ్గడ అన్న పేరు చేర్చే సంప్రదాయం వుంది.

విజయవాడ సమీపానగల రాయనపాడు గ్రామం ఈ రాయన ప్రెగ్గడ పేరుతో ఏర్పడినదేమో చరిత్ర పరిశోధకులు పరిశీలించదగిన అంశం. ఆ గ్రామంలో 12వ శతాబ్దం నాటి శాసనాలు రెండు లభించాయి. ఒక శాసనం ప్రకారం రాయన మంత్రి తన పేరుతో ఏర్పడినదేనని ఊహించడానికి అవకాశం వుంది. ఆయన మంత్రి మాత్రమే కాదు సేనాధిపతి కూడా.

## శాసన పాఠం

1. శ్రీ ఆసీద్వేంగ్గి గ్రామవాస్తవ్యవిప్రః క్కల్యాణర్ధ్గి మంత్రి కల్యాణదే
2. వః తస్యాపత్యం క్కౌశికోమంత్రి సోమ స్సోమాంఘ్ర్యబ్జేంద్దింద్దిరో
3. భూత్ప్రభుయ్యః॥ (1) తస్యాభూద్ధమ్మపత్నీ సుగుణగణవతీబొ
4. ల్ల మాంబోల్ల సద్దీజ్జాతస్తాఖ్యాము భాభ్యామతి విమలమతి
5. మ్మంత్రిరాయస్సురాయ్య । యష్షాడ్గుణ్య ప్రవీణః ప్రవిల
6. సదభలో పాయ పారాయణోయస్సారావ స్తంబ సూత్రద్విజ
7. కుల తిల క స్తంత్రవిన్మత్రివయ్యః (2) సోయంసుపుణ్యనిరతో
8. మకరంగతేక్కే మాతంగ్గ విశ్వజగ తిప్రమితే శకాబ్దేప్రా
9. దాదఖండతర దీపమక్కతారాన్మల్లేశ్వరాయ బెజ
10. వాడపురేశ్వరాయ (3) శకవరుషంబులు 1138 దగునేం
11. టి యుత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున శ్రీమన్మహామం
12. డలిక గొంటూరి ఒదయరాజుల సమస్తసేవాధిపతి యైన
13. రాయనపెగ్గడ మల్లేశ్వర శ్రీ మహదేవరకు అఖండదీప
14. మునకు ఇచ్చిన ఇనుపఎడ్లు 55 వీనింజేకొని వేలేటి
15. మల్లెన బోయుండు తన పుత్రాను పౌత్రికమున
16. సాన్యంబాటి మానికను నిత్యమానెండు నెఇ ఆచంద్రాక్కమ్మన
17. డప ంగలవారు। స్వదత్తంపరదత్తంవా ఓహరేతి వసుం ధరశష్టివ్వర్షష
18. సహస్రాణి విష్టాఅం జాఅతే క్రిమిః॥

# 23. మారిశెట్టి శాసనం

ఇది తొమ్మిది లైన్లుగల శిలా ప్రకటన. విజయవాడ ఇంద్రకీలాద్రి దిగువ అక్కన్నమాదన్న గుహల సమీపాన శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన గల శాసనం. కృష్ణాజిల్లా ఘంటసాలకు చెందిన కిలవు మారిశెట్టి కుమారుడు మారిశెట్టి క్రీ. శ. 1224వ సంవత్సరం చైత్రశుద్ధ ఏకాదశి సోమవారంనాడు వేయించిన శిలా ఫలకం ఇది. బెజవాడ మల్లీశ్వరస్వామికి మానెడు నెయ్యి అందజెయ్యడం కోసం మారిశెట్టి 25 ఆవుల్ని బటబో సూరెబోయని కుమారులు వలెన బోయడు, దామనబోయడు, ప్రోలెబోయడులకు దానం చేశాడు. ఇది విచిత్రమైన శాసనం. సరిగా ఇలాంటి శాసనమే దాన గ్రహీతల పేర్లు మార్పుతో అదే సంవత్సరం కార్తీక పౌర్ణమినాడు మారిశెట్టి పాలకొల్లులో ఒక శాసనం వేయించాడు. 'జలధీశ్వరదేవుని ఆరాధకులైన మారిశెట్టి వంశజులు స్వకులాభివృద్ధికి ఘంటశాల జలధీశ్వరునికి ప్రతినిత్యం అభిషేకం చేయించాలనీ, ఈ నియమం దాటినవారు కాశిక (కాశీ)లో బ్రహ్మహత్యా పాపం చేసినవారవుతారని శాసించాడు.

## శాసన పాఠం

1. స్వస్తిశ్రీ సకవర్షంబులు 1146 నేటి చైత్ర శు
2. ద్ధ ఏకదశయ్యు శోమవారంనందు బెజ్జవాడ మల్లీ
3. శ్వర శ్రీ మహాదేవరకు గంట్థశాల మిఱితి కెలవు
4. మారిశెటి·కొడ్కు మారిశెట్టి అఖండదీపమునకై
5. నిచిన మోదాలు 25 వీనింజేకొని బటబోల సూ
6. రె బోయని కొడ్కులు వలెన బోయుండును దామ
7. న బోయుండును ప్రోలె బోయుండునుం దమ పు
8. త్రాను పౌత్రికము నిత్యమానెండు నెయి ఆ
9. చంద్రార్కణముం బోయంగల వారు.



దేవదానవ యుద్ధంలో విజయం సాధించిన దేవతలు గర్వాతిశయంతో దేవదేవిని విస్మరించారు. అందుకు జగదంబ కోపించి కాళికారూపంలో దేవతలతో పోరాడి వారి గర్వాన్ని అణచింది. జ్ఞానోదయమైన దేవతలు అమ్మవారిని ఇలా స్తుతించారు.

"తం కీలాంద్రిం, స్వర్ణమయం, ఇంద్రాది దేవ సంసేవ్యాం,
తద్రూపాం, జగదంబికాం, తదంగ్రేం, దివ్య రూపిణీం"

# 24. సూరపోతరాజు శాసనం

విజయవాడ మల్లేశ్వరస్వామి ఆలయం సమీపాన విఘ్నేశ్వర ఆలయం పైకప్పునకు తాపటం చేసిన శాసనం ఇది. క్రీ॥శ॥ 1235 సంక్రాంతి పండుగనాడు సూరపోతరాజు బెజవాడ సమీపాన ఎనమలకుదురుగ్రామంలో ఒక ఖండ్రిక భూమిని, 26 గేదెలు మల్లీశ్వరస్వామికి దానం చేశారు. దేవానబోయుని కుమారుడు మల్లెబోయనికి ఈ దానం చేశాడు. దాన గ్రహీత మల్లీశ్వరస్వామికి ప్రతినిత్యం నెయ్యిపొయ్యాలన్న షరతు శాసనంలో వుంది.



## శాసన పాఠం

1. స్వస్తి సమధిగత పంచమ హాశి।
2. స్వస్తిసక వరుషంబులు 1157గు నేంట్టి విషు
3. పు సంక్రాంత్తి కాలమున శ్రీ మన్మహా
4. మండలేశ్వర కోనకండ్రవాటి సూ
5. రపోతరాజులు బెజవాడ మల్లేశ్వ
6. ర శ్రీమహాదేవరకు అఖండ దీపా
7. లకు ద్రుబ్బు పొలమునందు రేంగుల
8. చేను పుట్యండు నిద్దుమును మోచ
9. పాటి దక్షిణాన నెనమందుమును
10. కాబెరసి ఊమి దీపానకు నిచిన
11. ఖ1న10(॥) మరిని సూరపోతరాజు
12. గానే ఈ విషువు సంక్రాంత్తి కాలమునం
13. ద బెజవాడ మల్లీశ్వర శ్రీమహా దేవరకు
14. అఖండదీపానకు ఇచ్చిన ఇన్నపెడ్లు 55
15. వీనిం జేకొని దేవాన భోయిని కొడ్కు
16. మల్లెబోయుండు ముప్పనభో
17. యుండును పోతననభోయుండును
18. కమనాభోయుండు తమ పుత్రా
19. ను పౌత్రికమున ఆచంద్రార్క్కముగాను
20. నిత్య అడ్డెండు నేయి పోయంగల
21. వరూ భోలకు దర్భరేమ పడు
22. మట భూమి ఖ। (॥) స్వదత్తంపర
23. దత్తంవ ఓహరేతి వసుంధ్ధరాం షష్టివ
24. షా సహ స్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

## 25.కూచిన ప్రెగ్గడ శాసనం

ఇది గొంటూరి రాజవంశానికి చెందిన మహా మాండలికుడు నారాయణ దేవరాజు ప్రధాని కూచెనప్రెగ్గడ చేసిన శిలా ప్రకటన. ఈ ఫలకం శిథిల కనకదుర్గ మండప స్తంభంపైన వుంది. 11 లైన్లుగల ఈ శాసనంలలో మొదటి అయిదు పంక్తులు సంస్కృత భాషలో ఉన్నాయి. కూచెనప్రెగ్గడ తన పుణ్యం కోసం మల్లీశ్వర స్వామికి ప్రతినిత్యం మానెడు నెయ్యిపోసే షరతు మీద కుంటి కేతెబోయడికి 25 ఆవులు దానం చేశాడు. నారాయణ దేవరాజు విజయవాడకు మహామాండలికుడుగా వ్యవహరించాడు. ఆవులు మాత్రమే గాక ఒక ఖండిక భూమి కూడా కూచెనప్రెగ్గడ దానం చేశాడు.

### శాసన పాఠం

1. శ్రీమద్విధి ముఖోద్భూత వంశేప్రోలన సైజ్ఞికః।
2. ఆసీన్నామాభి ధస్తస్య ప్రోలనాఖ్యోభవస్సుతః (1) తత్పూ
3. సురద్రిగిరి రుద్రశతాబ్ద మేషసంక్రాంతి కేవ్యత
4. రదేత దఖండదీపం వత్సాన్వయః పెరువలధ్య
5. క్షకూచిమంత్రీ మల్లేశ్వరాయ బెజవాడ పురీశ్వరా
6. య (2) శ్రీమన్మహామండలిక గొంటూరి నారాయణ
7. దేవరాజుల ప్రధాని కూచెన పెగ్గడ తమకు ధ
8. మ్ముగావుగా అఖండ దీపానకు నిచ్చిన మోదాలు
9. 25 వీనిం జెకొని కుంటి కేతెబోయుండు దన పు
10. త్రాను పౌత్రికము నిత్యమానెండు నెయి పో
11. యంగలవారు । ఇబోయున్కి భూమి ఖ. 1 (॥)

❀ ❀ ❀

## 26.ప్రోలినాయుని శాసనం

ఇది 21 లైన్ల శాసనం. కొప్పుల వంశానికి చెందిన ప్రోలినాయుడు క్రీ॥శ॥ 1267లో వేయించాడు. ఆయన, ఆయన భార్య ముప్పసానితోపాటు తాత కొప్పమారెడ్డి, తండ్రి నారెబోయుడు, తల్లి కొమ్మసాని, అన్నలు కొర్నపుపాటి, విరపోతనాయుడు, డొంకెన మార్నెనల పుణ్యం కోసం చేసిన దానానికి సంబంధించిన శిలా ప్రకటన ఇది. వారి సద్గతుల కోసం మల్లీశ్వరస్వామికి అఖండ దీపం ఎత్తించడానికి అవసరమైన నెయ్యికోసం 50 ఆవులు దానం చేశాడు. దాన గ్రహీత కొమ్మనబోయనికి చిలకపూడిలో రెండు ఖండ్రిల భూమి, పెయ్యేరులో ఒక ఖండ్రి భూమిని, మల్లీశ్వరస్వామికి కిరీటం చేయించడానికి 28 వన్నెలు బంగారం, 1100 పలాల బరువుగల కంచు కంబము దానం చేశాడు.

### శాసన పాఠం

1. స్వస్తి । శ్రీ శకవర్షంబులు 1189 గు నేంటి విభవ సం
2. వత్సర మాఘ బ 14 గురువారము నాండు । స్వస్తి స
3. మన్త ప్రశస్తి సహితంబైన శ్రీమతు సోమయదేవ ది
4. వ్య శ్రీ పాదపద్మారాధక సకలాది భక్తుల పాదోదక
5. ప్ర సాదోపజీవులైన పగమెంచ్చుగండ కొంప్పుల ప్రోలి
6. నయుండు ముప్పసాని దొడ్డదేవర నగనబోయు
7. ండు నుం దమ తాతలు గొప్పరెడ్డికి తండ్రి గారె బో
8. యిన్కి తల్లి కొమ్మసాన్కిం దమ అన్నలు కొఋపుపాటి ఎఱ
9. పోతినాయునికి డొంక్కెన మార్నెనికి ధర్మార్తంగా బెజవా
10. డ మల్లేశ్వర శ్రీమహాదేవరకు అఖండ్డదీపములు 2 కి ఇ
11. చ్చిన మోదలు 50 వీనిం జెకొని నూనె కొమ్మసలు బోయుని కొ
12. కొ సోమనబోయుండు తన పుత్రాను పౌత్రికము అ చ
13. ంద్రార్కస్తాయిగా నిత్య అడ్డెండు నెయి పోయంగలవారు ఇబో
14. య్నికి చిలుకపు డిని భూమి ఖ 2 పేయేట భూమి ఖ 1 ఆ నాగన
16. బోయుండు సే ఇంచిన కిరీటము 1 దీని యెత్తునగ 28 వన్నె
17. 15 వీరిపెటిన కందుక కంబము 1 దీనియెత్తు 1100 (॥)
18. స్వంతం పరదతంవా వ్యో
19. హరేతి వసుంధరాం షష్టివ
20. ష సహస్రణి నిష్టాయాం జా
21. యతే క్రిమి ॥

## 27. వీరబలంజ శాసనం

వీరబలంజులు మధ్యయుగాలనాటి వ్యాపార వర్గానికి చెందని చతుర్థ కులజులు. బలిజకులస్తులలో ఒక వర్గం వీరబలిజులు, వీరినే వీరబలంజులు అంటారు. బహుశ వీరశైవ మతానుయాయులైన బలిజ కులస్తులు కావచ్చును. అత్యంత పురాతనమైన ఈ కులవర్గం ఒకప్పుడు ఆంధ్రదేశ రాజకీయ, ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకగా నిలచింది. సమాజంలోని వివిధ వర్గాలలో వీరి స్థానం చాలా బలీయమైనది. వర్తకంలో వీరిది అందెవేసిన చేయి. ఉప్పు వ్యాపారం చేసిన వారిని ఉప్పు బలిజలని అనే వారు. పదాతి దళంలో ఈటెలను ఆయుధాలుగా చేసుకొని పోరాడటంలో కడు నేర్పరులైన బలిజలను ఈటె బలిజలు అనేవారు. వీరికీ, తెలికలకు బాదరాయణ సంబంధం బహుశ వర్తకం వల్లనే వుండేదేమో. అందువల్లనే ఈ శాసనంలో తెలికివేవురి ప్రస్తావన వున్నట్టు సుప్రసిద్ధ చరిత్రకారుడు స్వర్గీయ బి.ఎన్. శాస్త్రి వ్యాఖ్యానించారు కాని ఈ ఆరు లైన్ల శాసనంలో ఎక్కడా కనబడటం లేదు. మల్లికార్జున వీధిలో ఏదో గుడిగోడకు తాపడం చేసిన శిలపై ఈ శాసనాన్ని పురావస్తు పరిశోధకులు 1914లో కనుగొన్నారు.

### శాసన పాఠం

1. స్వస్తిశ్రీ సమస్త భువన జన వినయ విపుల విజ్ఞానకీర్తి శౌచవ
2. రులు వీరబలంజ సమయ ధర్మ ప్రతిపాలకులును మ్రోంకాటీ ప
3. ట్ట బద్ధులును పరాంగ్గనా పరాగ్ముఖులును రణరంగ్గ రామమి
4. తరణ కర్ములును త్యాగబలీంద్రులును భోగ దేవేంద్రులును సత్య హ
5. రిశ్చంద్రులును శౌచ గాంగ్గేయులును నీతి రాజ్యవిభవులును అ
6. నీతి రాజ్యధూరులును వేదవేదాంగ ఇతిహాస పురాణ కావ్యతర్క

## 28. మాంకిరెడ్డి శాసనం

ఇది కృష్ణా జిల్లాకు ముఖ్యమైన శాసనం. చాలా అప్రధానంగా పైకి కనిపిస్తున్నప్పటికి గొప్ప చారిత్రిక సత్యాన్ని ఆవిష్కరిస్తున్నది. యుద్ధమల్లుడు బెజవాడలో కుమారస్వామి ఆలయం నిర్మించినట్టు బెజవాడ శాసనం చెబుతున్నది. అయితే ఆ ఆలయం ఏమైందో తెలియదు.కాని క్రీ॥శ॥ 1282లో వేయించబడిన ఈ శాసన ప్రకటన ప్రకారం అప్పటివరకు అనంతసేనుని ఆలయం బెజవాడలో ఉన్నట్టు స్పష్టమవుతున్నది. ఆ సంవత్సరం (చిత్రభాను) చైత్రశుద్ధ పాడ్యమి గురువారంనాడు యెరవోలు మాంకిరెడ్డి తన తండ్రి మలినేని తల్లి, నల్లసాని పుణ్యానికి గాను కుమారస్వామికి 50 గొర్రెలు దానం చేశాడు.

### శాసన పాఠం

1. స్వస్తి । శ్రీ శకవరుషం
2. బులు 1204 అగు నేటి
3. చిత్రభాను సంవత్సర చై
4. త్ర శుద్ధ 1 గు స్వస్తిశ్రీ మ
5. తు అనంతసేన దేవరకు
6. యెరబోలు మాంకిరెడ్డి
7. తమ తండ్రి మల్నేనికి తల్లి న
8. ల్లసానినకిన్ని పుణ్యముగా
9. ను అఖండ దీపానకిచ్చిన
10. గొఱెలు 50 వీని చేకొని నా
11. -- మలె బోయుండు

# 29. సర్వరాజు శాసనం

ఇంద్రకీలాద్రిపైన మల్లీశ్వరాలయం సమీపాన విఘ్నేశ్వరుని గుడి కప్పునకు అమర్చిన రాతిపై తొమ్మిది పంక్తులలో చెక్కబడిన శాసనమిది. శాసనం క్రీ. శ. 1286 వ్యయ నామ సంవత్సరం వైశాఖ శుద్ధ పంచమి మంగళవారంనాడు మల్లీశ్వరస్వామికి అఖండ దీపానికి శ్రీకాకొలని ఉంగరాల సర్వరాజు తన తల్లితండ్రుల పుణ్యానికి 25 ఆవులను దానమిచ్చిన సందర్భంగా వేయించిన శాసనం. కొప్పనబోయుడు ఆవులను గ్రహించి నిత్యం మానెడు నెయ్యి పోయగలవాడని వుంది. ఈ శాసనంలో అయిదవ లైను నుంచి అక్షరాలు పోయినాయి.

## శాసన పాఠం

1. స్వస్తిశ్రీ శక వరుషంబలు 1208 నేంట్టి
2. వ్యయ సంవత్సర వైశాఖ శు 5 ను శ్రీకాకొలని యుంగ
3. రాల సవ్వరాజు తమ తల్లిదండ్రులకు ధర్మ్మా
4. వుగాను బెజవాడ మల్లీస్వర శ్రీమహాదేవరకు
5. అఖండదీపానకు సమిపిం--
6. దాలు 25 వీనిం జేకొని కడపఱ ----
7. రె బోయినికొడ్కు కొప్పనబోయుం---
8. మానెండ నెయ నడప---
9. ం గలవాండు మ---

❋ ❋ ❋

# 30. బాచాబత్తుని శాసనం

ఇది ఎప్పుడు వేయించిన శాసనమో తెలియదు. భాషనుబట్టి 13-14 శతాబ్దాల నాటి శాసనం కావచ్చును. ఏ కాలం నాటిదైనా ఒక అప్పు ఇచ్చినవాడు, అప్పు తీసుకొన్నవాడి మధ్యగల నైతిక సంబంధాలను తెలియజెప్పే శాసనం. కుమార తెలుగురాయని పేరునుబట్టి 14వ శతాబ్దానికి చెందినదిగా భావించవచ్చును. పినకూను బాచాబత్తునికి మెల్లగుంట కూనిశెట్టి ఇచ్చిన దాన వివరం ఇందులో వుంది. కుమార తెలుగు రాయనికి 1200 టంకాలు బాకీ పడ్డాడు. బాకీ తీర్చలేకపోయాడు. బాచాబత్తుడికి కూనిసెట్టి హామీ వున్నాడు. బాచాబత్తుడు బాకీ తీర్చలేక పోయాడు. బాధ్యత కూనిసెట్టిది అయింది. వివాదం సూరవరం గ్రామ పెద్దల మధ్యకు వచ్చింది. కూనిసెట్టి బాధ్యత అంగీకరించి అసలు చెల్లించాడు. వడ్డీ చెల్లించడానికి అతడికి ఆస్తులు ఏమీ మిగలలేదు. వడ్డీ క్రింద తాను చేసిన సమస్త పుణ్య కార్యాల వల్ల లభించిన పుణ్యాన్ని ధారపోస్తున్నట్టు ప్రకటించాడు కూనిసెట్టి.

## శాసన పాఠం

1. శుక్ల సంవత్సర ఆషాఢశుద్ధ 10 గురువారాన పినకూను బా
2. చాబత్తున్కి మొల్లగుంట కూనిసెట్టి యిచ్చిన శాసనములు
3. కుమార తెలుంగు రాయనికి 1200 వేయిన్ని యినూ
4. ఱు టంకాలకు నిన్నుం బూంటవెట్టి దనముపెట్టలేక సూర
5. వరపు పెక్కంండ్ర ముంద్ధఱం జేశిన నిర్ణయం మొదలి ధ
6. నాననకు పత్రిమిచ్చి వడ్డి ధనానకై నేం జేశిన సుగృతాలు॥
7. ఆకిరిపల్లిని నే వేయించ్చిన చుఱువున్ను ఆ చెఱువు వెనక
8. తాళున్ను ఆమామిళున్ను ఆ రావులున్ను యెక్కోటిగణా
9. లున్న బ్రాహ్మకులం జేయించిన వడుగులు పెణ్ణిండ్లు
10. న్ను అతిథి అభ్యాగతికిం బెట్టిన సుగ్రుతాలున్ను యిం త్తవ
11. టు నీకు యిస్తిని । యిందుకు సాక్షి అష్టలోక ధర్మ
12. పాల సాక్షి శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# 31. ప్రతాప రుద్రదేవరాజు శాసనం

కనకదుర్గ గుడికి వెళ్ళే దారిలో దర్గాకు ఎదురుగా ఇరిగేషన్ ఆఫీసు ప్రాంగణంలో దొరికిన శిలా శాసనం ఇది. మొత్తం 26 లైన్లుగల ఈ శాసనాన్ని క్రీ॥శ॥ 1298లో కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజు వేయించాడు. నేటి గుంటూరు జిల్లా బావపట్ట (బాపట్ల) గ్రామాన్ని తెనాలి సమీపంలోని ప్రేంపల్లి (రేపల్లె) గ్రామంలోగల భావనారాయణస్వామి ఆలయానికి దానం చేస్తున్నట్టు వేయించిన శాసనమిది. మొదటి పంక్తి, 15, 18 లైన్లలో అక్షరాలు రూపుమాసిపోయాయి.

## శాసన పాఠం

1. - - - - -
2. ఱశంబులు 1220
3. యగు నేంటి విశం
4. బి సంవత్సర వైశా
5. ఖ శు11 గు స్వస్తి శ్రీ
6. మన్మహామండలే
7. స్వర ముఱాయ జ
8. గద్దళ కాకతియ్యప్ర
9. తాపరుద్రదేవమహా
10. రాజులు కమ్మనాంటి
11. ప్రేంపల్లి శ్రీభావనా
12. రాయ్యణ దేవరకు
13. తమకు ధమ్మ్యవుగా
14. బావపట్ట - - -
15. - - - యమదుప
16. డికి ఈస్మి యాచంద్రార్క
17. ముగాను । ఈధమ్మ్యవు
18. -- శినావారు వారణ
19. సి క్షేత్ర వేవురు బ్రా
20. హ్మణులు వెఇకవి
21. లెలా వధిఇంచిన
22. వారు । స్వదత్తం పరదత్తం
23. వా యోహరేతి వసుంధ
24. రాం శష్టివర్షరుష సహ
25. స్రాణి విష్ఠాయాం జా
26. యతే క్రిమిః॥



# 32. కపిలేశ్వర గజపతి శాసనం

ఇది ప్రతాపరుద్రదేవ మహారాజు శాసనం దొరికిన ఇరిగేషన్ ఆఫీసు ఆవరణలోనే లభించింది. 22 లైన్లుగల శిలా ప్రకటన. కృష్ణా జిల్లా చరిత్రలో ప్రత్యేక స్థానం సంపాదించుకొన్న ఓఢ్రరాజు కపిళేశ్వరగజపతి వేయించిన శాసనం. 16వ శతాబ్దం నాటిది. ఈయన పేరుతో ఏర్పడినదే ఉయ్యూరు సమీపాన గల కపిలేశ్వరపురం కొండపల్లి ప్రాంతంలోని జక్కిరెడ్డిపల్లి గ్రామాన్ని బందరు సమీపానగల లంకపల్లి గ్రామాన్ని మరికొన్ని గ్రామాలను దానంగా ఇస్తూ వేయించిన శాసనం.

## శాసన పాఠం

1. శ్రీ మద్విజయ వాటిఖ్యాపురీ కృ
2. ష్ణవిభూషణే । ఇంద్ర కీలాద్రి మూలా
3. ధి వాసో పాపవినాశనే (1) ఈశానా
4. ధి పథాదీనాం గయా కోటి శతా
5. నిచ - క్షేత్రే ప్రయాగ కాశిఖ్యాం సత్య
6. ం శత గుణాధికం ॥ (2) కలౌ శ్రీమత్సః
7. కాబ్దేద్రి వసురగ్ని శశి క్రమాత్ । రాజా
8. గజపతి క్ష్మా భూ విఖ్యాతో కపిలేశ్వరః
9. (3) తతః స్వరాజ్య మధ్యేతు కొండ్డపల్లి స్త
10. లాంత్తరే। దత్వా పాపవినాశేశ బొంగర

11. గాద కారణం (4) గ్రామం రెమ్మని పుణ్యా
12. దౌ రుద్రపాదార్చనాధకం। జక్కిరెడ్డ్వ
13. ల్లి నామ నగ్రహార - - -
14. త్ర (5) అనాశిదేవి భోగార్థం నాగ వా
15. రమ వారితం । తతః క్షేత్రో బ్రహ్మణాఖ్య జం
16. గ్గమం శతసమ్మితం (6) భోజనార్థం లంక
17. పల్లి వానరం సయోజతం - దేవతాభ్య బ్ర
18. హ్మణేభ్య భోగ భోజన కారణం (7) దా
19. నం సదక్షిణాకంత్తు గ్రామపంచక తక్షణ
20. ధారా పూర్వమిదం ధర్మ శాసనాచం
21. ద్ర తారకం ॥ (8) మంగ్గళ మహా
22. శ్రీశ్రీ జేయున్॥



## 33, తెలికివేపురు శాసనం

ఈ శాసనం విజయవాడ నగరంపై క్రీ॥శ॥ 1409 సంవత్సరంలో తెలిక కులస్థుల ప్రాబల్యాన్ని చాటి చెబుతున్నది. తెలిక కులస్థులకు అయోధ్య, గజపుర పట్టణాలలోని అధిష్టాన దైవమైన మల్లీశ్వరుడు కులదైవం. వీరికి బెజవాడ మల్లీశ్వరుడు ప్రీతిపాత్రమైన దైవం. ఆ కాలంలో వ్యాపార రీత్యా వేంగి దేశం ఉత్తరం నుంచి దక్షిణానకు, దక్షిణము నుంచి ఉత్తరానికి, అలాగే తూర్పు, పశ్చిమ దిశలకు తెలిక కులస్తులు ప్రయాణం చేయవలసి వచ్చినప్పుడు మధ్యలో బెజవాడలో ఇష్టదైవమైన మల్లీశ్వరుని పూజించేవారు. అనేక దాన ధర్మాలు చేసేవారు. తెలికలకు కపిల ముని కుల గురువు. కపిలముని తెలిక కులస్తుల ఆచార వ్యవహారాలను వ్యాపార సూత్రాలను నిర్దేశించాడు. ఏ చారిత్రక నేపథ్యంలో శ్రీపతి పండితాధ్యుడు తెలిక కులస్తులకు కులగురువయ్యాడో తెలియదుగాని నెల్లూరు పట్టణంలో పూర్వం ఒక పీఠం వుండేది. ఈ కులస్తులకు, చాళుక్య వంశానికి ఎలాంటి సంబంధముండేదో తెలియదు. మహా శివభక్తులైన తెలికలు మల్లీశ్వరస్వామిని చాళుక్యరాజ్యానికి మూల స్తంభంగా పరిగణించారు. అంతటి పరమశైవులు విజయవాడ నగరంలో మల్లీశ్వరస్వామి గుడి ముందు నంది మండపం నిర్మించారు.

### శాసన పాఠం

1. స్వస్తి । యమనియమ ధర్మా పరా
2. యణ బ్రంహ్మ సంభవ పౌ
3. లస్తెయ కులక్రమాగత మ
4. ను వంశోద్భవ సకల శాస్త్ర వి
5. శారద కనకాపురి అయోధ్యా
6. పురి గజ పురాది నాయక ఇ
7. ంద్ర కీలనగ శ్రీకృష్ణ వెణ్యా నదీ
8. తీర శ్రీ విజయవాటి పురాధి నా
9. యక సకళైశ్వయ్యా సధాన్వయ
10. కపిల మహాముని వరప్రసా
11. దక లబ్ద చాళుక్య రాజ్య మూల
12. స్తంభాయ
13. మానులైన బె
14. జవాడ మల్లే
15. శ్వర దేవదివ్య
16. శ్రీ పాదపద్మా
17. రాధకులైన
18. అఖిళ దేశాల
19. తెలికి వేగురు
20. న్ను । స్వస్తి శ్రీ శ
21. క వర్షంబులు
22. 1331 అగు
23. నేంటి విరోధి
24. సంవత్సర శ్రా
25. వణ శు 15 కర్కాటక సంక్ర
26. మాణ పుణ్యకాలానను బెజ
27. వాడ మల్లేశ్వర దేవర ముంద
28. టి నంది మండపము అఖిల
29. దేశాల తెలికి వేగురున్ను చేయి
30. ంచ్చిన ధర్మము । మంగళ మ
31. హా శ్రీ శ్రీ శ్రీ॥

# 34. తెలికివేవ్వురు శాసనం

ఈ శాసనం కూడా ఇంచుమించుగా 33వ నెంబరు తెలికివేవ్వురు శాసనంలాంటిదే. 17 సంవత్సరాల తర్వాత అనగా క్రీ॥ శ॥ 1426 పరాభవ సంవత్సరం మాఘశుద్ధ విదియ సోమవారంనాడు మల్లీశ్వరస్వామి గోపురం ముందు తెలిక కులస్థుల సంఘం బెజవాడ మల్లీశ్వరస్వామి ఆలయ ముఖ మండపం నిర్మించినట్టు ఈ శాసనం చెబుతున్నది. ఇది 20 లైన్ల శాసనం. ఈ శాసనంలో తెలికలు బెజవాడ మల్లీశ్వరస్వామికి పాదపద్మారాధకులని చెప్పుకొన్నారు. వీరు సకలశాస్త్ర విశారదులని ఈ శాసనంలో ఉన్నది. క్రీస్తు శకం 1436 అనగా పరాభవ సంవత్సర మాఖశుద్ధ విదియ సోమవారంనాడు తెలికలు ముఖ మండపం నిర్మించినట్టు శాసనం వల్ల బోధపడుతున్నది.

## శాసన పాఠం

1. శ్రీ స్వస్తి। యమ నియ్యమ ధర్మ్మపరాపయణ బ్రహ్మస
2. ంభవ పౌలస్తెయ కులక్రమాగత మనువంశోద్భ
3. వ సకలశాస్త్రవిశారద కనకాపుర అయోధ్యాపుర
4. గజపురాధినాయక యింద్రకీలనగ శ్రీకృష్ణవె
5. ణ్యానదీతీర శ్రీవిజయవాటికాపురాధినాయక
6. సకళైశ్వయ్య్రసధాన్వయ కపిలమహాముని
7. వరప్రసాధకలబ్ధ చాళుక్య రాజ్యమూల స్తంభాయ
8. మాన్యులైన బెజవాడ మల్లేశ్వరదేవ దివ్య శ్రీపాద
9. పద్మారాధకులైన అఖిలదేశాల తెలికివేగురుంన్ను
10. స్వస్తి। శ్రీశకవషంబులు 1348 అగు నేంటి పరాభ
11. వ సంవత్సర మాఘ శు 2 సొమ శ్రవణ పుణ్యకా
12. లాన బెజవాడ మల్లేశ్వరదేవర గోపురము
13. ముద్దంటి ముఖ
14. మండపము అ
15. ఖిల దేశాల తెలి
16. కి వేగురున్ను ఆచ
17. ంద్రస్తాయిగాం
18. జేయించ్చిన ధర్మ
19. ము॥ మంగళమహా
20. శ్రీ శ్రీ శ్రీం జేయున్॥





# 35. శీరామాయ శాసనం

బెజవాడ పాత శివాలయంలో తూర్పుద్వారం నుంచి ప్రవేశించగానే కుడివైపున గల శాసనాల సముదాయంలో కనిపించే శాసనం. క్రీ॥శ॥ 1437లో పినకూను బత్తుని కూతురు శీరామాయ వేయించినది. ఆమె బెజవాడ మల్లీశ్వరస్వామికి మహా భక్తురాలు, లేదా అప్పటికి బెజవాడలో గల పాప వినాశేశ్వరస్వామి భక్తురాలు.

నిత్యం స్వామివారికి ధూపదీప నైవేద్యాలు జరిపించగలందులకు రెండు ఖండికల భూమిని దానం చేసింది. ఈ మాన్యాన్ని నాచమ్మ అనే స్త్రీకి ఇచ్చింది. కృష్ణానది మధ్యలో దాత, ప్రతిగ్రహీత నిలబడినపుడు శీరామాయ కృష్ణా జలాన్ని పోస్తూ దానం చేసినట్టు చెప్పింది. ఎవరైనా దానం చేయడం పుణ్యమేగాని మరొకరు చేసిన దానాన్ని నిలబెట్టగలిగినవారికి రెట్టింపు పుణ్యం వస్తుందనికూడా శాసనంలో చెప్పింది. ఈ శాసనంలో మరొక గొప్ప విశేషమేమంటే శాసనం చివర మచబత్తుడు శిరామక్క, పినకూను బత్తుడు, మాచలదేవి నృత్య భంగిమలు గల చిత్రాలు ఉన్నాయి.

ఈ చిత్రాలను బట్టి శీరామాయ కూడా నర్తకి కావచ్చునని పిస్తున్నది. మాచలదేవి ఎవరో తెలియదు. ఆమె శ్రీనాథుడు చెప్పిన మాచలదేవి అవునో కాదో తెలియదు.

## శాసన పాఠం

1. స్వస్తి । శ్రీశక వర్షంబులు 1359 అగు నేం
2. టి పింగళ సంవత్సర శ్రావణ బ 5 సో॥ బెజవా
3. డ మల్లేశ్వర శ్రీమన్ మహాదేవరగుడి బో
4. గము పినకూను తలాభక్తుని కూంతులు
5. శీరామాయ కృష్ణవేణ్యా తీరమందును ప్రీతి
6. మి గల గోత్రకెలాను పుణ్యముగాను
7. తనకు బెజవాడను శాసనస్థమై అష్టభోగస్వా
8. మ్యముగాను చెల్లివచ్చి క్షేత్రము నాలుగుపుట్లు
9. వల్లాను పాపవినాశన దేవరకు నిత్య ధూపదీ
10. ప నైవేద్య అవసరాలకును ఖ 2 నేల నాచంమకు
11. నిత్య ధూపదీప నైవేద్య అవసరాలకు ఖ2
12. న్ని కృష్ణవేణ్య లోపలను దారవోసి ఆచంద్రా
13. ర్కౄముగాను యిచ్చెను॥ యీధర్మౄము పాలించి
14. వారికి దాసిదాసిని॥మంగళ మహాశ్రీ శ్రీం
15. జేయును॥సదత్తాద్ ద్విగుణం పుణ్యం పర
16. దత్తాను పాలనం పరదత్తాప హారేణ స్వద
17. త్తం నిష్పలం భవేత్॥



# 36, మాచలదేవి శాసనం



ఈ శాసనం శిరామాయ శాసనం ఉన్నచోటునే వుంది. ఇది 42 పంక్తులుగల మూడు ముఖాల శాసనం. ఇందులో రెండు శాసనాలు ఉన్నాయి. ఇది ఏ సంవత్సరంలో వేయించినది తెలిసే అవకాశం కనిపించడం లేదు. అయితే శిరామాయ శాసనాన్నిబట్టి ఇది క్రీ॥శ॥ 1437 నాటిదేననిపిస్తున్నది. నిజానికి ఈ శిలా ప్రకటనలో రెండు శాసనాలు కనిపిస్తున్నాయి. బహుశా ఎవరో పాలకుడు తన ఉద్యోగులకు చెల్లించిన జీతాలలో రూపాయికి దమ్మిడి, పెళ్ళిళ్ళు చేసేవారు మేళానికి చేసే ఖర్చులో రెండు అంకణాలు బెజవాడ పాపవినాశదేవరకు ఇవ్వాలని శాసించినట్టు కనిపిస్తున్నది. దానికిందనే మాచలదేవి వేయించిన శాసనం వుంది. తన గోత్రీకుల పుణ్యానికి గాను పాటూరు, తాడేపల్లి, పెనుమాక, ఎనికేపాడు, పులిపాక, పటమట, గుణదల గ్రామాలలోగల పొలాలలో ఒక పుట్టెడు భూమిని మల్లీశ్వరస్వామికి దానం చేసింది. చిత్రాలను బట్టి శిరామాయ శాసనంలోని మాచలదేవి, ఈ మాచలదేవి ఒక్కరేనని స్పష్టమవుతున్నది.

## శాసన పాఠం

మొదటి ప్రక్క

1. బెజవాడ పానవినాశెన దేవ
2. రకున్ను రుద్రపాదలకున్ను పృథివి
3. మీందం గల గోత్రంవారు దండం
4. పెట్టి ఇచ్చిన దర్మశాసనము ॥ మా
5. కు అన్ని రాజ్యాలానుం గల వార్కి
6. అయా స్తానల చెల్లి జీతానను
7. 1కి ద 2 న్ను పెండ్లి రెంణంకాలు మే
8. ళానను నొకపాలున్ను ఇదర్మపు
9. పనులకును ఆచంద్రార్క స్తాయి
10. గాను ఇస్తిమి । ఇందుకు ఇంద్రకి
11. ల పర్వతమున్ను కృష్ణవైణ్యాను
12. మల్లిఖార్జున దేవరాను సాక్షి ।
13. బెజవాడ పాపవినాశన దేవ
14. ర రుద్రపాదాల స్తనాల ధర్మా
15. ల్కు పిపనకూను తలాబత్తుని కూ
16. తురు మాల్దేవి తనకు జెల్లి
17. వ్రితి క్షేత్రాలు ప్రాతూరను (పు)
18. పుట్టెండు క్షేత్రమున్ను తాడేపల్లి
19. ని పుట్టెండు క్షేత్రమును పెనుం
20. బాకను పుట్టెండు క్షేత్రమున్ను గొల్ల
21. పూండిని పుట్టెండు క్షేత్రమున్ను నర్సా
22. రి గ్రామానను పుట్టెండు క్షేత్రామూను
23. నున గ్రామానను పుట్టెండ క్షేత్రము
24. న్ను గుడుందల గ్రామానను పుట్టెండు
25. క్షేత్రమున్ను వెనకపద్ది గ్రామానను
26. పుట్టెండు క్షేత్రమును ఈ పది గ్రామాల
27. ల కేసరిపాటి పదిపుట్లు క్షేత్రమున్ను

28. పృథివ్వింగల గోత్రంవారికి ఋణ్యము
29. గాను ధారవోశి ఇచ్చన ధమ్మశాస
30. నం మంగ్గళ మహా శ్రీ శ్రీ జేయున్
31. పట్టుమెట్ట గ్రామన పుట్టెండు క్షే
32. త్రమున్ను పులుపాక గ్రామన
33. పుట్టెండు క్షేత్రమును

రెండవ ప్రక్క

34. బెజవాడ మల్లేశ్వర దేవరు
35. నాలువాల్ల స్తానపతులున్ను పిన
36. కూను మాచబత్తున్కి ఇచ్చిన
37. శసనం మల్లేశ్వర దేవరకు
38. ంగల గ్రామాలాను పాపవినశి
39. న దేవరకుంగల గ్రామాలాను
40. గ్రామ గ్రామాన 5 బత్తు
41. న్కి కేసరిపాటిన 5 చేను ఇస్తి
42. మి॥ ఆచంద్రార్కంగాను ఇస్తిమి.



మాచలదేవి వేయించిన నానా గోత్రికుల శాసనం

# 37. శింగరాజు శాసనం

ఇది విజయవాడ కనకదుర్గ ఆలయం ముందు గల స్తంభంపైన నాలుగువైపులా చెక్కిన శాసనం. 240 లైన్లు ఉన్నాయి. శాసన స్తంభం విరిగిపోయింది. మొదటి ప్రక్క 59 లైన్లు ఉన్నాయి. ఈ భాగంలో మొదటి ప్రక్క 59 లైన్లు ఉన్నాయి. ఈ భాగంలో 21 శ్లోకాలు, రెండవ ప్రక్క సంస్కృత వచనంలో 70 పంక్తులు, మూడవ ప్రక్క 12 లైన్లు సంస్కృత భాగంలో మూడు లైన్లు వచనం తొమ్మిది పంక్తులు శ్లోకాలు ఉన్నాయి. మొత్తం సంస్కృత భాగం 141 లైన్లు. సంస్కృత భాగంలోని సారాంశం క్లుప్తంగా మూడవ ప్రక్క 26 లైన్లలో తెలుగులో ఉంది. నాల్గవ ప్రక్క 73 లైన్లు తెలుగులో వుంది. ఇదంతా సంస్కృత శాసనానికి సంక్షిప్త అనువాదం. క్రీ॥శ॥ 1518లో కృష్ణదేవరాయల ప్రధాన మంత్రి తిమ్మరుసుకు సమకాలికుడైన సింగయ్య దేవ మహారాజు వేయించిన శాసనం. ఈ శాసనం విష్ణుకుండిన వంశం పరంపర 16వ శతాబ్దం వరకు కొనసాగినట్టు నిరూపిస్తున్నది. కంఠమరాజు మనుమడు పాపరాజు, అతని కుమారుడు సింగరాజు, ఇతడు కనకదుర్గాదేవికి అంతరాలయం, రంగ మండపం, భోగ మండపం నిర్మించి ఇచ్చాడు. ఈ శాసనంలో చెప్పిన కంఠమరాజు విజయనగరం (జిల్లా) పాలకులైన పూసపాటి వంశీకులకు కంఠమరాజు మూలపురుషుడు. ఈ శాసనంలో కంఠమరాజు నుంచి బేతరాజు వరకు మాధవవర్మ వంశానికి చెందిన 20 మంది పేర్లు కనిపిస్తాయి.



## శాసన పాఠం

మొదటి ప్రక్క

1. శుభమస్తు । శ్రీ గనాధిపతయే నమః శ్రీ దుర్గా
2. యై నమః అస్తి ప్రీతికరం చక్ర నామ్నామా
3. మ్నాయ భూమికా। మహస్త్రి జగదా రా
4. ధ్య మహస్కర మునీశ్వరం (1) అలంఘ్య శాసనై
5. ర్బాహుబలం బహుభిరాశ్రితైః । అల
6. ంకృత మభూత్తస్య కులం గురుతరం నృ
7. పైః అజానుబాహులరేతేషు భూజా
8. నీషు బభౌతరాం । రాజా మాధవ వర్మా
9. భ్యో రాజా తారాగణేష్వివ ॥ (3) చండికాయా
10. రణే దైత్య ఖండితాయాః ప్రాదతః । అ
11. ష్టా పదమయీ వృష్టిః సృష్టాయేన యశస్వి

12. నా । (4) సవాన్ నేతాన్ గుణేనాథః కుర్వాణో
13. గురు విక్రమః ఆసీత్కంతమ రాజేంద్రః
14. సాసీ రిపువిజిత్వరః ॥ (5) ఆసీమ ధరణీ
15. చక్ర శాసీతస్య తనూభవః ఆసీ ద
16. న్నల దేవేంద్రో దాసీకృత ధరావతిః ॥ (6)
17. భాగీరథ్యవ సాధోథేః సుగీత చరితా
18. బుధైః ఆర్యా నృపస్యతస్యాసే ద్భార్యా
19. కేశవ నానమకా॥ (7) యాతుం యశాం సి
20. యో జంతూం స్రాతుం దాంబసి మ
21. జ్ఞతః । సేతుం బబంధ గోదాయా యా
22. తుంగ జల వీచికా । (8) సంగరాజి రమా
23. సాధ్య వంగ రాజాది జిత్వరః । అంగ
24. రాజాధికస్త్యాగే సింగ రాజస్తతోజని॥ (9)
25. లక్క మాతస్య భార్యాసీ దర్కమానా
26. వ హోజనః । అక్రమాదరి భూపా
27. లాన్ విక్రమాదేవ నిఘ్నతః (10) పెదవల్ల
28. భ భూపాల పినవల్లభ భూపతీ।
29. పుత్రా బధూవతః పద్మనేత్రా పుణ్య
30. భరైస్తయోః (11) పెదవల్లభ భూపాలో
31. వల్లభే సన్యదుర్లభే । ఆగా దన్నల దేవీ
32. శ్రీ రాయకమ్మాభి ధావహో (12( తయో రన్నల
33. దేవీ శ్రీ పెద వల్లభ భూపయోః తనూ
34. -- రాజేంద్ర తన్మరాయౌ బధూ
35. -- (13) -- శ్రీరాయకమ్మాయాః పా
36. పరాజ ప్రభాకరౌ । ఆకార్షీదనయో
37. రేకః శ్రీ ప్రభాకర పట్టణం (14) పాపరాజ
38. స్య తస్యాసీద్వల్లభా వల్లమాంబికా।
39. అంగరాజ ఇవార్కస్య సింగరాజస్తయో
40. ః సుతః (15)దే మమా పిన్నలాదేవీ లక్కమా వి
41. ల సత్కమా । తి స్రః శ్రీతమ్మ రాజస్య వచః
42. స్రక్కుమ్మభేస్త్రియః (16) పుత్రం బసవరా
43. జ ఖ్యం మిత్రం మధ్యాసి ధే మమా । ల
44. బ్ధ్యాజహాస సేనాన్యా మత్వా పుత్రవతీ
45. ముమాం ॥ (17) యుద్ధే యేనాభి భూతః స ప్రతి
46. బలయుతః పారశీకక్షితీంద్రోప్యన్యే
47. క్షోణీభృతో యద్భిరుద మనుపమం మ
48. ల్లికా వల్లభాది । దుర్గాణ్యుగ్రా రివర్గాచ
49. పిచజ గృహిరే బాహువీర్యా దవార్యా
50. ద్దివ్యా చర్యా యదీయ్యా త్రిభువన భవ
51. నైః సూయతే యస్య కీర్తిః । (18) ప్రసూయ పిన్నలా దే
52. నీ ప్రభుం తింమ్మాహ్వయం---
53. మధికాంశబ్యా జయంతా దహరత్సుతా
54. త్ - (19) గుణశాలి జనం గుండ్ల మడుగుం య
55. స్తటాకతః సముద్ర సదృశం తిమ్మ సము
56. ద్రం విదధే విభుః (20) రామేణ కోసెలా
57. ధీశ కుమారీవ తనూభువా । రాజే
58. వల్లభ రాజన లక్క మా
59. విలసత్ క్రమా ॥ (21)

రెండవ ప్రక్క

1. ఇహకిల జగతి సకల రిపుకుల మవ
2. జిత్య ఆయస్తంభ మది పొట్టునూరు
3. నిధాయ నిజవశే గజ తురగ బల మఖి
4. ల రాజ్యం ప్రాజ్యం చ యవనపతే రఖిలా
5. ం విజిత్య దిశో విజనగర మాసాద్య మ
6. జిమయ మారుహ్య సింహాసన మఖిల
7. మపి భువన భారం మూర్తిమతి విశ్వా
8. స నివాసే నిఖిల గుణాసుమతి తపన ధా
9. మ్ని సాళ్వ తిమ్మనామ్ని మంత్రిణి పాతి
10. విజిత సుర మంత్రిణి నిధాయ పద
11. వాక్యప్రమాణ పారావార పారదృశ్య నాం
12. ప్రతి విబుధ పలాలమాత రిశ్వనాం మ
13. నీషిణా మపి కావ్యనాటకాలంకార భా
14. షా విశేష వేదినాం చతుర్విధ కవితా సా
15. మ్రాజ్య మధి తిష్ఠతాం కవీ నామస్య సరే
16. షామపి విద్యావతాం మహతాం గోష్ఠీమ గరిష్ఠామ
17. సతత మవనీ వనీపకమనీషిత పూరణేషుచ

18. మనో నిధాయ నిరవధిక మతుల మవనీ సామ్రా
19. జ్య సుఖ మనుభవతి కృష్ణదేవరాయ మహారాయే
20. హృదరిపు యువతి జనాలంక్కారేణ వసిష్ట
21. గోత్రా లంక్కారేణ బలేనాపి నిరహంక్కారేణ
22. నిఖిల జన విదితేన పురోయాయినా।
23. మానినా యల్లమ జానినా వదన విజితాం
24. భోజేన భోజే నాపరేణ పరేణా నభి భవనీ
25. య్యేన పాపరాజేనచ కోమల వరపుషాకొం
26. డ్డరాజేన చ బలవతా బసవతా బసవరాజేన చ సక
27. ల కలావల్లభేన వల్లభరాజేన చ భుజి వి
28. జిత నాగరాజేన నాగరాజేన చ జితరిపురా
29. జేన బేతరాజేన చ సుత వతా సురతరుసుర
30. భి చింతామణీ నతిశయానేన యానేన సం
31. చరమాణేన రమమాణేన సమితి వీరశ్రీ
32. యా నృగల నహుష నాభాగ భరత భగీరథ
33. దశరథరామాది గుణానుకారిణా సకల జ
34. నోపకారిణా సతత మారారిణామదనేన విమత
35. మదదమనేన సదవన సావధానేన సకల గుణ
36. నిధానేన సింగరాజాభిధేయేన భాగధేయేన
37. మూర్తిమతా వల్లాంబికా పాపరాజయో
38. రధి బహుధాన్యమధి వైశాఖమధి పూర్ణిమా
39. మధి విజయవాట మధిరణ మహినిహ
40 తా సురవర్గా యాదుర్గా యావరాలయేన
41. సహ రంగంమంటపో భోగమంటపోప్య
42. ధి విజయనగరమధి చిత్రభాను సమమి
43. ధి మాఘమాస మసురవధ భై రవస్యరణ
44. మండల భై రవస్యరమ్యేణ హర్మేణ సహ
45. మంటపోసి తదైవ తదేవ నగర మలం
46. కుర్వాణస్య సమదఖిల గీర్వాణస్య
47. నిరుపమ ముఖచంద్రస్య రామచంద్ర
48. స్య రధారోహణ సమయోచితో మంట
49. పోపి కనకగణపతి శివయోః ప్రతిష్ఠాచ
50. జగదవన దక్షస్య విరూపాక్షస్య పశ్చి
51. మ భాగౌ దుర్గాంలయోప్యధి వృషవర్ష
52. మధి శ్రావణ మధి రాచూరు జగదేకనా
53. ధస్య రంగనాధస్య వరాలయేన సహవాటి
54. కావ్యధిభావ వర్షమధి మాఘమాస మ
55. ది చాంగలమట్టి జగదీశ్వరస్య రామేశ్వ
56. రస్య ప్రాకారగోపుర రంగమంట పాశ్చ
57. తదావాసస్య కేశవస్య ప్రకారగోపురే చ
58. నిహత నిఖిలదైత్యస్య తత్రత్యస్య వెంకటే
59. శస్య రంగమంట పోపిత ద్వై వేభవదన భ
60. వన ప్రతిష్ఠాచ తదావాసశ్చ నిజమాతృ
61. వల్ల మాభిధానాంకితా వీధీచ తిరు
62. మల రాజాభిధేయేన జ్యేష్ఠేన గరిష్ఠేన
63. -- మ్మసముద్ర ప్రతినామ గుండ్లమ
64. డుగు నామక పురే వినాయక శివ విష్ణు
65. దేవాలయై స్సహ తటాకారామవాపి
66. కా బ్రహ్మ ప్రతిష్ఠాదికా సప్తసంతానాశ్చ
67. సర్వాణ్యేతాని తానిచ తదన్యానిచ
68. పుణ్యాని కర్మాణి మహాంతి భాం
69. తి విరచితాని చత్వారింశ
70. దధిశ్రీ త్రై దశశతైరుక్తే

మూడవ ప్రక్క

1. చతుర్భిశ్శతైః సంఖ్యాతే శకవత్సరే సముది
2. తే శ్రీశాలిమాహాంకితే। వై శాఖే బహుధా
3. న్యకేచ విజశ్రీవాటికాయాం వ్యధాత్ (1)
4. దుర్గాయా నిలయంచ మంటపయుగం
5. శ్రీసింగభూమీపతిః (22)
6. గంగాభంగాభిషంగా వహరయ ఫణితి
7. ప్రౌఢనానాకవీంద్ర స్తోమక్షేమప్రకామ
8. ప్రకటనజనిత స్ఫూర్తి కీర్తి ప్రశస్తిః।
9. తత్తద్ధిగ్జైత్ర వృత్తి ప్రసృమరవిభవః
10. పాపరాజాబ్ధిచంద్రః తత్తత్కృత్వం
11. వినుత్వం విధివదతనుః శ్రీనిధిః
12. సింగ్గరాజః (23) శ్రీశ్రీశ్రీ

13. శ్రీ దుర్గాSవరప్రసాదులైన శ్రీ మాధవ వర్మ
14. వంశోద్భవులైన కంతమరాజు మనుమండు
15. పాపరాజుంగారి కొమరుండు సింగ్గరాజు
16. ం గారు యీ బెజవాడ దుర్గా దేవంమకు
17. అంతరాళిక । రంగ్గ మంటప । భోగమంటపా
18. లున్ను కట్టించ్చి - రాచూరి శ్రీ రంగ్గరాజుల గు
19. డిన్ని బావిన్ని కట్టించ్చి చలివంద్రిని తోంటా
20. ను పెట్టించి ఆ రంగనాథుని అంగరంగ వైభవా
21. లకు బొమ్మనహళ్లి అనే గ్రామము ధారవోశి
22. యిచ్చి అహోబిలప్రాంతమందు సింగవరము
23. అని అగ్రహారమున్ను కొండవీటి రాజ్యము
24. లోను తమ పూర్వనాయంక్కరమైన పుల్లనంగ
25. ంటి సీమలోని కొమ్మవరానకు ప్రీతినామకమైన
26. సింగవరమని గ్రామమున్ను అగ్రహారాలు చేశి
27. స ప్తసంతానాధీశ్వరుండై। విజయ నగరమందు
28. విరూపాక్షదేవుని గుడి పడుమటి పట్టిక...
29. దుర్గ గుడిన్ని 1 రామచంద్రదేవుని రథోత్సవమం.
(తరువాతి కొంత స్థలము వదలివేయబడి ఈ క్రింది మూడు పంక్తులు చెక్కబడినవి)
1. శ్రీ వితస్తి విస్తుతేనాపి సర్వైస్తు వితతేజసా సీతాంబోధి
2. తోయేన కుంభజెనాస్యగస్తినా । పూర్వంకృతేచ
3. యీశాన నామాపి తదనంతరం ఆరాధ్య మల్ల
30. టపమున్ను కనకగణపతి శివాలయములున్ను
31. కటించిరి । విద్యానగర రక్షకుండైన రణమండలము
32. భైరవేశ్వరదేవుని ముఖమంట్టపమున్ను మీంది
33. ఉప్పరిగాను కట్టించిరి । ఆ సింగరాజగారి పె
34. ద కొమారుండైన పాపరాజు । భైరవదేవుని వైభ
35. వానకు పెద్దఘంట్ట జేగంట భేరి మొదలైనవి స
36. మర్పించ్చి ఆ దేవుని అంగరంగ వై భవాలు నడవను
37. కడ రామాపురము స్థలములోని తోంటను సమ
38. ర్పించ్చెను ॥శ్రీ॥

నాలుగవ ప్రక్క

1. శ్రీ శుభమస్తు ॥స్వస్తిశ్రీ
2. జయాభ్యుదయ శాలివాహనన శ
3. క వర్షంబ్బులు 1440 అగు నే
4. ంటి బహుధాన్య సంవత్సర వైశా
5. ఖ శు 15 ఆ శ్రీ మన్మహారాజాధి
6. రాజ రాజ ప రమేశ్వర శ్రీ వీరప్రతా
7. ప శ్రీకృష్ణదేవరాయ మహారాయ
8. లుంగారు ప్రిథివి రాజ్యం శేయుచు
9. అడ్డంగాను సాళువ తిమ్మరసయ్య
10. ంగారు మహాప్రధానులై నడపం
11. గాను వసిష్ఠగోత్రం సూర్యవంశో
12. ద్భవులైన । హోసఓరుదరగండ స
13. హకార బాంధవ । మల్లికావల్లభ
14. రణరంగభైరవ 1 గండ్డధనంజయ
15. । బిరుదాంకితులైన బెజవాడ
16. దుర్గా వరప్రసాదులైన మాధవ
17. వర్మ వంశోద్భవులైన కంతమరా
18. జుంగారి కొమారుండు అన్నలదేవరాజు
19. ఆయన కొమారుండు సింగ్గరాజు ఆయన
20. కొమారుండు పెదవలభరాజు ఆ పెద వ
21. ల్లభరాజుం గారి పెద్దదేవులైన అన్నలదేవి
22. కొమాళ్ళు సింగరాజున్ను తంమరాయం
23. డున్ను పిన్నదేవులైన రాయకమ్మ కొమా
24. ళ్లు ప్రభాకర పట్టణం గట్టించిన ప్ర
25. భాకర రాజున్ను పాపరాజున్ను । యీన
26. లుగురిలోను తమ్మరానింగారి కొమాళ్ళు
27. వుదయగిరి యేలిన బసవరాజున్ను తిరు
28. మల రాజున్ను వల్లభరాజున్ను । పాపరాజు
29. ం గారికిన్ని ధనంజయ గోత్రులైన కీర్తి పా
30. టి సిరిగిరిరాజుంగారి కొమారిత వల్ల
31. మ దేవులుం గారికిన్న కొమారుండైన శ్రీ మ
32. న్మహా మండ్డలేశ్వర సింగయదేవ మహా
33. రాజులు తమ తల్లిదండ్రింగారికిన్ని తమ
34. అన్న బసవరాజుంగారికిన్ని పుణ్యముగా ను

35. న్ను తన కీర్తి సుకృతాలు ఆ చంద్రార్కులై
36. వుండే అట్లుగానున్ను శేయించ్చిన ధర్మాలు 1
37. ...పూర్వనాయంకరమైన చాంగల
38. ...కేశవదేవరకు గోపురమున్ను
39. ........
40. కు గోపుర ప్రకారాలున్ను...
41. గుడిన్ని చాంగలమ్మ గుడిన్ని తమ తల్లి వల్ల
42. మ దేవులుంగారి పేరను తిరుమలదేవర గు
43. డి మంటపమున్ను వీధిన్ని కట్టించ్చి తమ
44. అన్న తిరుమలరాజు బెటిన గుండ్లమడుగు తి
45. మ్మ సముద్రమని అగ్రహారానను వినాయక
46. శివ శిష్ణు దేవాలయాలున్ను తటాకారామా
47. లున్ను బ్రహ్మప్రతిష్ఠలున్న ప్రతిష్ఠించి బెజవా
48. డ వద్దను తమ తాత మాధవవర్మకుం బ్రత్యా
49. క్షమైన దుర్గాదేవికి తొలి నిర్మితమై వుం
50. డిన గర్భగృహ ముందరి అంతరాళికము
51. న్ను పదిలం శేయించ్చి ఆ ముందరను నల్లశీన
52. పు రాళ్ళను అంతరాళికమును ఆ ముందరను
53. తొమ్మిది అంకణాల రంగమంటమున్ను। ఆ
54. ముందరను భోగమంటపమైన మూడు అంక
55. ణాల భద్రమున్ను కటించ్చి రాతిగోడను పెట్టి
56. ంచ్చి। పీఠము కట్టించి యప్పుడు భూమిలోన
57. నుండి వెళ్ళనెత్తిన కేశవనాథునిన్ని మీందం బ్ర
58. తిష్ఠ శేయించ్చి ॥ దుర్గాదేవమ్మ వుద్భవమై వు
59. ండిన కొంత వుత్తరపు దిక్కుచట్టు। తూర్పు
60. పడమల్లు నిడుపు తొంమిది చేతులున్ను ।
61. ఆ వెడల్పు యేడు చేతులున్ను ॥ ఆ పొడవు యె
62. నిమిది చేతులున్ను ॥ నఱకించ్చి ధూప అవసరము
63. ---
64. ము గాను ధమ్మ్రము ప్రతిష్ఠచేశి వ్రాయించ్చి
65. నిలిపిన ధర్మశాసనము ॥మంగళ మహా
66. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీం జేయును
67. శ్రీ దుర్గాదేవమ్మ తన వరప్రసాదులైన యీ
68. గుడి గటించ్చిన సింగ్గరాజుంగారికిన్ని ఆ
69. యన కొమాళ్ళు పాపరాజు కొండరాజు బ
70. సవరాజు వల్లభరాజు నాగరాజు బేతరాజు
71. ం గారికిని ఆయుష్యాభివృద్ధిచేశి వంశా
72. భి వృద్ధిచేశి రాజ్యాభివృద్ధిచేశి రక్షిం
73. చ్చెను శ్రీశ్రీశ్రీ



# 38. తెలిక కులస్థుల ఒప్పంద శాసనం

క్రీస్తు శకం 1553లో తెలిక కులస్తులు మల్లీశ్వరస్వామి ఆలయం తూర్పు ద్వారం ముందు ముఖ మండపం పై 22 లైన్ల శాసనం వేశారు. ఇది ఆనాటి తెలికకులీనుల ఆచారాలకు సంబంధించిన శాసనం. ఆ సంవత్సరం పరీధావి ఫాల్గుణ శుద్ధ తదియ బుధవారంనాడు కొండపల్లి, కొండవీడు, రాజమండ్రి పట్టణాలకు చెందిన తెలికలు బెజవాడలో సమావేశమై వివాహ మర్యాదలకు సంబంధించిన ఒప్పందం చేసుకొన్నారు. ఆనాటి తెలికలు తమ ఇంటిలో మొదటిసారిగా పెండ్లి జరుపుకునేటప్పుడు ఓలి క్రింద 21 చిన్నమాడల బంగారాన్ని మగపెళ్ళివారు కుల సంఘానికి ఇవ్వాలి. అలాగే రెండు ఎత్తులు వెండి కూడా ఇవ్వాలి. పెళ్ళికూతురువారు రెండు మాడల బంగారం ఇవ్వాలి. ఈ శాసనంలో బంగారం తూనికలకు సంబంధించిన కొలతలు విచిత్రంగా ఉన్నాయి. ఎత్తువిడెము, శాసన మాడ లాంటి మాటలకు సరియైన వివరణ అంది రావడం లేదు. ఒప్పందంలోని నియమాలను ఉల్లంఘించినవారు దురాచారవంతులని, కులదైవమైన మల్లికార్జున లింగాన్ని దాటినవారవుతారని శపించారు.

## శాసన పాఠం

1. స్వస్తిశ్రీ శకవర్ష
2. ంబులు 1475
3. అగు నేంటి పరీధా
4. వి సంవత్సర భా
5. ల్గుణ శు 3 బు ।
6. కొండ్డవీడు, కొండ్డపల్లి, రాజమహే
7. ంద్రవరము మొదలైన అఖిల దేశా
8. ల తెలిక వేగురున్ చేసుకొన్న వివాహ
9. మర్యాద। ప్రథమ పెండ్లికి వోలి
10. మర్యాద యిరువై యొకచిన్న మా
11. డాను బంగారం పెండ్లికొడుకు
12. వారు మ 2 త్తున్ వెండి మ 12 న్
13. పెండ్లి కూంతురు వారు భంగా
14. రం మ 2న్ శాసమాడ విరిచివేశి నికర
15. ం ఇరువై చిన్నమాడల చొప్పున నడ
16. చు వారం। యెత్తు విదెం వుభయ
17. వాదులున్ । యెత్తు వారం । ఇ
18. మర్యాద యవ్వరు దప్పినాను మ
19. ల్లిఖార్జున లింగానకుం దప్పి
20. ప్పి నడిచినవారు హీనవాదులు ॥
21. శ్రీశ్రీశ్రీం జేయును ॥



కిరాతార్జున స్తంభం మరో ముఖం

# 39. సాతలూరు తామ్ర శాసనం

ఆంధ్రదేశాన్ని పాలించిన గొప్ప రాజ వంశాలలో తూర్పుచాళుక్య వంశాన్ని చెప్పుకోవాలి. ఆ వంశంలో అగ్రగణ్యుడు మూడవ గుణగ విజయాదిత్యుడు. ఆయన విజయవాడను రాజధానిగా చేసుకొని వేంగి దేశాన్ని 40 సంవత్సరాలు పాలించాడు. వేంగి దేశమంటే నేటి ప్రకాశం, గుంటూరు, ఉభయగోదావరి, విశాఖ జిల్లాల్లో కొంత కలసిన సువిశాలమైన ప్రాంతం. ఈ మహారాజు మొత్తం తొమ్మిది తామ్రశాసనాలు వేయించాడు. ప్రస్తుత శాసనం కృష్ణాజిల్లా సాతలూరు గ్రామంలో మట్టిదిబ్బ తవ్వుతూ వుండగా దొరికింది. కనుక దీనికి సాతలూరు శాసనం అన్న పేరు వచ్చింది. ఇది ఏడు రాగిరేకుల శాసనం. క్రీ॥ శ॥ 9వ శతాబ్దంనాటిది.

ఆ కాలంలో నేటి గుడివాడ ప్రాంతాన్ని గుధ్రవార విషయం అనేవాళ్ళు. ఆ ప్రాంతంలో శంత గ్రామాన్ని మహా విద్వాంసులు, వేద వేదాంగాలు, ఇతిహాసాలు, 64 కళలలో పండితులు, నిత్యాగ్నిహోత్రులు, శమదమనియమ నిష్ఠాగరిష్ఠులైన వందమంది బ్రాహ్మణులకు అగ్రహారంగా ఇచ్చాడు. ఈ శాసనంలో రెండు ముఖ్యమైన అంశాలు ఉన్నాయి, ఒకటి శాసనాన్ని వ్రాసిన శిల్పిపేరు లేఖకాదిత్యుడు అతడు విశ్వకర్మలాంటి వాడు. స్వయంగా పెదఘంటశాలను నిర్మించాడని శాసనంలో వుంది. నిర్మించినది పెద్ద ఘంట కావచ్చు. కనుక నేటి ఘంటసాల పేరు ఆ గ్రామంలోని పెద్ద ఘంటవల్ల వచ్చినదనుకోవచ్చును. ఇదొక ముఖ్యమైన అంశం. అంతేగాక ఈ శాసనంలోని 'అరినృపవాజివారణ....' అనే శ్లోకంలో తెలుగు ఛ్ఛందస్సు లక్షణాలు ఉన్నాయి. ఉత్పలమాలావృత్తంలో ప్రాస నియమం పాటిస్తూ వ్రాసిన శ్లోకం అది.



రెండవరేకు మొదటి ప్రక్క

## శాసన పాఠం

### మొదటి రేకు

1. స్వ(స్తి) శ్రీమ(తాంప) కలభవనసంసు యమానమానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌ
2. (శి) కీ వరప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగన పరిపా లీతానాం స్వామిమహాసేన పాదా
3. నుధ్యాతానాం భగవనా రయణ ప్రసాదసమాసాదితవరవర హలాఞ్చనేక్షనక్ష
4. ణనశికృతారాతి మణ్డలానా అశ్వమేధావభృతన్న నపవిత్రకృతవపుషాం చాలు



రెండవరేకు రెండవ ప్రక్క

5. క్యానాం కులమలంకరిష్ణోః సత్యాశ్రయ వల్లభేన్ద్రస్య భ్రాతాద్కు జ్జవిష్ణువర్ధన అష్టాద
6. శవర్షాని తస్యసూనుః సకలలోకాశ్రయో జయసింహ వల్లభః త్రయస్త్రింశద్వర్షాని
7. తస్యానుజస్య ఇన్ద్రభట్టారకస్య ప్రియతనయః విష్ణురాజః నవవర్షాని తస్యసుతం

**రెండవ రేకు:: మొదటిప్రక్క**

8. మంగిదౌంశరాజః పఞ్చవింశతీవర్షాన్నీ తస్య పుత్ర జయసిహవల్లభః త్రయోదశవ
9. షాణీ తస్యానుజః ద్వైమాతురకొక్కిలిః షణ్మాసాత్ తస్యాగ్రజః విష్టురజః స్వనుజముచ్ఛా
10. ట్యపఞ్చత్రింశద్వషాణీ తస్యాత్మజః విజయాదిత్యా (త్య) మహారాజ అష్టాద(శవ)ర్షాని తస్యత
11. నయః విష్ణువర్ధనః పఞ్చత్రింశద్వర్షాణీ ద్వాదశ సహస్రప్రమాణ వే (న)గీ మణ్డలం
12. మన్వపాలయన్ తస్యజ్యేష్టః విజయాదిత్యః ఆదిత్య ఇవసతతోదయకరి విన్యాట
13. వివ సువంశశతాధారః మేరురివ సున్నర్ వన్నీకృతతను (ః ) హరజట (టా)మకుట ఇ(వగం)గడా
14. రవప్రతిబన్ధనసమర్థః సురపతిగల ఇవ సతతదాన (కరీ) విష్ణురి(వ)బ

**రెండవ రేకు:: రెండవ ప్రక్క**

15. లీ (లి)రిపుమతణః శేషమహానాగివ భూధరణక్షమభుజః మహావ్రతివ మహాశంఖ
16. ధ్వనివిరాజనః స(కలగంగ)గజ్జర్జలదఘటకోటివిత్రాసన విశిష్టమా
17. రుతః అపిచం(౧) శ్రీ (మద్ధర్మ్మ) స్యమూర్తి (ర్తి) స్సుభ(ట)మధుపస (ద్) బోధనా భోరుహాభ (ః) శౌర్యాగ్న్యు
18. త్పతి (త్తి) బీజప్రియవచనమనే(ణే)రాకరః సర్వ్వసన్తో (।) కీర్తిస్త్రీవల్లభస్సత్కులగృహమ
19. మలం సత్యవానీ కుమార్యా(ః) విద్వద్భృన్దస్యధామ ప్రకటమవనినపో గో&రతనిస్తరకాంకః (॥౧)
20. అష్టోత్తరశతన (రే) న్ద్రేశ్వరదేవ(వా)లయానాంకర్త్తాద్వాదశ వర్ష యుద్ధం వల్లభేన్ద్రదణ్డ
21. నాయకైః సహ భీమసళుకె సమ్మాన స్వనుజ నిర్జిత్య గృ (హీ)త వేగిమణ్డల (ః)చత్వారిశ

### మూడవ రేకు:: మొదటిప్రక్క

22. ద్వషాణీ(షాణి) తస్యసుతః (।) అరినృపవాజివారణపదాతి మహాభ్రవిరామ మారుతః (।)
23. కడకరి సస్తితాసిభరుచి ప్రవినాశన భానున్నిభః (।) గురుతరదిణభాగ (వ)త
24. మనవమనిత కల్పపాదపః (॥) వరకరిగల్ల భూమిపభుజసిరిహాజీ (జి)భువిప్రహా
25. సతే(॥౨) కలివిట్ట నామావర్షర్ద్ధ తస్యసూనుః విజయాదిత్యః అనేక తులాధృతసువన్న
26. దానధారాసన్తప్పి(త బ్రాహ్మ)ణాని కుమ్మః గుణక్కేనల్లనితి జయగియమానకీర్తిస
27. స్దక్షిణాపథ సత్రి కలింగదేశ మన్వపాలయా ఏవపఙ్చవిష్ణువర్ద్ధనామానః ద్వౌ జ
28. యసిహనామానో ఏకో మగియూవరాజ (ః) త్రయ విజయాదిత్య నామానః తత్రత్రితియవి.

### మూడవ రేకు:: రెండవ ప్రక్క

29. జయాదిత్య ద్వారిప్రతిష్ఠాపిత గంగాయమున చన్ద్రాదిత్య హలీకేతన సమధిగతః
30. పఙ్చమహాశబ్ద శ్రవణవిత్రాసితమతురాశశ్చకే (?) వరహలాఙ్ఛనన వీరమకరధ్వజ (ః।)
31. సత్యేన ధమ్మపుత్రః కన్న(స్) త్యాగేన విక్రమేన హరిః (।)నృపకామ (ః) స్వామ్యనుజోవిప్రేభ్యోదీ
32. ది(శ)ద్గ్రామ (13) అదాద్భువనక్క స్దప్పః గ్రామద్విజతథాయతం (।) ప్రేరిత స్వానుజేనాథనృప
33. కామేనన్నరయే (॥౪) శ్రృన్తగ్రామముం రజ సోపగ్రామ వినాకరమ్ (।) నాతికుణ్ఠేన సాకం
34. హిదత్త వాన్మత్త భుసుర (ః॥౫) పునరపితస్యై (వ?) రాజ్ఞ (ః) విశేషణ సత్యవచనోయ (మ) సురో
35. న ససురాధిపభయాద్భవతి సత్యవచనః (।) శౌయ్యగుణవాన్నృగ (ప)తీన్నస వివేకము.

### నాలుగవ రేకు:: మొదటి ప్రక్క

36. తితోభవతిశౌయ్యం గుణవా(।) దానవిభవో రవిసుతోన సపతీస్వబలతో భవ
37. తి దానవిభవః (।) సత్యపరశౌయ్యపరదానవిభవస్తునృపకామనృపతిః ప్రకృతితః (॥౬)
38. విజయాదిత్య భు(భూ)పతి (ః)స్వానుజేన నృపకామే (వ) ప్రేరిత (ః)సు(సూ)య్యగ్రహణనిమిత్త్య స విజ
39. యాదిత్య (ః) రాష్ట్రకూటప్రముఖాన్కుటిబిన సవ్వనిత్థమాజ్ఞపయతి (ః) విదిత స(మ)స్తు
40. భిః గుద్రవారవిషయే శన్తగ్రామే నాతీకుణ్ఠసహితం ద్విజశతా(య)దత్తవాన్ (।) వేదివేదా
41. గేతిహాసపురాణాది చతుష(ష్ష)ష్టి కలానిశాకలేభ్య(ః) (ప)రమ బ్రహ్మవిద్భ్యః పరితాగ్ని
42. హోత్రాధ(ద)్యనుష్ఠానపరేభ్యః శమదమయమనియమాశ్రీ (శ్రి)శౌచాచారశీలగుణగనా

### నాలుగవ రేకు:: రెండవ ప్రక్క

43. లంకృత శరీరపద్భ్యః ధాత్రాయ్యమాదిద్వాదశాదిత్య సమానభ్రాజిత కీర్తి(ర్తి) (ః) తథాహిప్రతి
44. గ్రాహకా (ః) స్వస్తిశ్రీమత్ వంగిపఙ్వాస్తవ్యాయ యజ్ఞశమ్మణే త్రయోభాగాః గుణ్డశమ్మంణే ఏకోభాగ (ః)
45. విదడిశమ్మణే ఏకోభాగః ద్రోణశమ్మణే అర్ధశః రకమిచేడు వాస్తవ్యాయ పర(రా)శరగో
46. త్రాయ ద్రోణశమ్మణే అర్ధ్యర్ధకో భాగః కఞ్చిశమ్మణేధ్వౌ భాగౌద్రోణశమ్మణే ద్వౌభా(గౌ)బ
47. ద్దిశమ్మణే పఙ్చమోభాగాః కఞ్ణోఅవాస్తవ్యాయ భారద్వ(ద్వా)జగోత్రాయ శివనశమ్మణే త్రయోభా
48. గాః రేవశమ్మణే ఏకోభాగాః శివికుఞ్జిశమ్మణే ఏకోభాగా శణ్డిలగోత్రాయ వేతశమ్మణే
49. ఏకోభాగః అయ్యప్పశమ్మణే అర్ధ్యర్ధకోభాగః దేవరతగోత్రాయ వకశమ్మణే ఏకోభా (గః)

**ఐదవరేకు :: మొదటి ప్రక్క**

50. సవ్వ శమ్మర్ణే ఏకోభాగాః కుణ్ణిశమ్మర్ణే ఏకోభాగా వగిపఱ్వాస్తవ్యాయ కతగోత్రయు
51. దడిశమ్మర్ణే ద్వౌభాగౌ వెన్నశమ్మర్ణే అర్ధ్రశః హరీతగోత్రాయ రేవశమ్మర్ణే ద్వౌభాద్రోణ
52. శమ్మర్ణే అధ్యర్ధకోభాగః కోణ్డిన్య గోత్రాయ శ్రీధరశమ్మర్ణే త్రయోభాగాః దమశమ్మ
53. గా కేశవశమ్మర్ణే ఏకోభాగః త్రివిక్రమశమ్మర్ణే అర్ధర్ద్ధాంం ఉపూటూరు వస్తవ్యాయ కౌ
54. శికగోతాయ కోణ్ణిశమ్మర్ణే ద్వౌభాగౌ కాశ్యపగోత్రాయా (య)ఋద్వశమ్మర్ణే ఏకోభాగః గో
55. ళశమ్మర్ణే అర్ధాంశః ఋద్వ శమ్మర్ణే అధ్యర్ధకో భాగః గోళిశమ్మర్ణే ఏక(కో) భా ఎఱశమ్మర్ణే ఏ
56. కోభాగౌ క్రంజవాస్తవ్యాయ కాశ్యపగోత్రాయ మహాకాలశమ్మర్ణే ద్వౌభాగౌ (దోణ)మశ(మ్మ)

**ఐదవరేకు :: రెండవ ప్రక్క**

57. ణే అర్ధాంశౌ నారాయణ శమ్మ(ణే ఏకో) భాగః కౌశికి గోత్రాయ పిట్టమశమ్మర్ణే ఏకోభాగః కోణ్డిన్య
58. గోత్రాయ ద్రోణ(శమ్మ)ణే ఏకోభాగః కారమిచేడు వాస్తవ్యయ కణ్వగోత్రయ సర్వశమ్మ
59. భాగౌ చామిశమ్మర్ణే ఏకోభాగః హరీత గోత్రత్రాయ కఞ్చిశమ్మర్ణే ఏకోభాగః మహీధర శమ్మర్ణే
60. ఏకోభాగః దినకరశమ్మర్ణే ఏకోభాగః హరీత గోత్రత్రాయ కఞ్చిశమ్మర్ణే ఏకోభాగ క్రోవశ్రీ వస్తవ్యా
61. యరథీరగోత్రాయ నారాయణ శమ్మర్ణే ఏకోభాగః భారద్వాజ గోత్రాయ ఆగ్యపశమ్మర్ణే
62. ఏకోభాగః వెన్నశమ్మర్ణే ఏకోభాగః గుణ్ణశమ్మర్ణే ఏకోభాగః కుత్సగోత్రాయ తూకశమ్మర్ణే
63. ద్వాభాగౌ బొప్పణశమ్మర్ణే ఏకోభాగః కౌశికగోత్రాయ రవిణశమ్మర్ణే ఏకోభాగఃకార

**ఆఱవరేకు: మొదటి ప్రక్క**

64. ఞ్చేడు శివస్తవ్యాయ లోహిత గోత్రయ గోయిన్దశమ్మర్ణే ఏకోభాగః కోణ్డిన్యగోత్రాయ ఇరుగమశ
65. మ్మర్ణే ఏకోభాగః భీమశమ్మర్ణే ఏకోభాగః మధువణశమ్మర్ణే ఏకోభాగ ఉప్పటూరువా
66. స్తవ్యాయ భారద్వాజగోత్రాయ కేశవశమ్మర్ణే ఏకోభాగః గుణ్ణశమ్మర్ణే ఏకోభాగం నాగశ
67. మ్మర్ణే ఏకోభాగః ఆత్రేయగోత్రాయ నారాయ(ణ) శమ్మర్ణే త్రయోభాగారాయూరు వాస్తవ్యా
68. య అగ్ని వేశ్యగోత్రాయా మయిన్దమశమ్మర్ణే ఏకోభాగః కశ్యపగోత్రాయ బొపశమ్మర్ణే

మూడవ రేకు మొదటి ప్రక్క

మూడవరేకు రెండవ ప్రక్క

69. ఏకోభాగ కుణ్డురువాస్తవ్య (వ్యా)య గౌతమగోత్రాయ ద్రోణశర్మణే ద్వాభాగౌ భారద్వాజ గోత్రాయ క
70. న్దశర్మ్మణే ఏకోభాగః ఉపు(ప్పు)ట్టూ(టూ)రు వాస్తవ్యాయ పరశరగోత్ర(త్రా)య వీరశర్మ్మణే అర్ధ్యర్ధకోభాగః
71. చామిశర్మ్మణే ఏకోభాగః త్రివిక్రమశర్మ్మణే ఏకోభాగః భీమశర్మ్మణే ఏకో

**ఆరవ రేకు :: రెండవ ప్రక్క**

72. భాగః బవ్వశర్మ్మణే ఏకోభాగః దుగశర్మ్మణే అర్ధాంశ బీమశర్మ్మణే ఏకోభాగః (వ)ంగిపఱ్ఱ
73. (స్త)వ్యాయ గౌతమగోత్ర(త్రా)య బటశర్మ్మణే ఏకోభాగః కౌణ్డిన్యగోత్రాయ సోమశర్మ్మణే అర్ధ్యర్ధకో
74. భాగఃద్రోణశర్మ్మణే ఏకోభాగః మాధవశర్మ్మణే ఏకోభాగఃద్రోణశర్మ్మణే ఏకోభా(గః)కుందురు
75. వస్తవ్యాయ కౌశికగోత్రయ ద్రోణశర్మ్మణే ఏకోభాగః కారఞ్చేడు వాస్తవ్యాయ (భా)రద్వా
76. భారద్వాజసగోత్రాయ ఎఱశర్మ్మణే ఏకోభాగః ద్రోణశర్మ్మణే ఏకోభాగః శివ (శర్మ్మణే) అ
77. ర్ధాంశః వల్లన(య్య) శర్మ్మణే ఏకోభాగః రేవశర్మ్మణే ఏకోభాగ శ్రీపురవాస్తవ్య (వ్యా)య హరీత గోత్రా
78. య సబడిశర్మ్మ(ణే అర్ధ్యర్ధకో) ద్వాభాగౌ॥ భట్టనాం వింశతిశ్చపి ఏకవేదాంచ వింశతి (॥) త్రీ(త్రి)ంశత్రి వేదిన
79. స్తద్వత్ చతు(ర్వేదవదాశ)తిః(॥౭) తత్రానుష్ఠీయమనస్తే అశీర్ధత్వా స్వభూభృతే (।) సదాస (ముష్ట?)

**ఏడవరేకు :: మొదటి ప్రక్క**

80. వేదాశ్చ సుఖం జీవన్తు భూసురాః (॥?) అస్యావధయః పూర్వ్వత (ః) పెనుబూన్డీసీమై స(ణ)త అఱుత
81. గూరుసి(సీ)మై (వ) నైరతీత (ః)మ్ము (ము)ంజలురుసీమై (వ) పశ్చిమత ఉరివిసీమై (ఫ)తు బుఱుబల్లిసి (సీ)
82. మై (వ?) శనతఃములుడు బెన్డోఱుసీమై (వ) చతురవధిక్షేత్ర దత్తవాః॥ ఆజ్ఞప్తిరస్యధమ్మ(ః)స్య
83. ణ్డరంగోమహాగుణః(।) స (సా)సిధారాసముచ్ఛిన్న విద్విడ్బు (డ్బృ)న్దోపవన్దిత (॥౮) కృతకాలస్య
84. పుత్రపౌత్రో మహి(హీ)తలే (।) గగణాదిగభ్భసద్బుద్ధిశ్శాంసనంకర్మ్మనససమ్ (॥౧౦)
85. లేఖకాదిత్య (ః) శాసనస్యాస్యపణన్ధితః (1) విశ్వకమ్మవయోభాతి ఘణ్టశాలా స్వజ(॥౧౧) బహుభి
86. ర్వసుధాదత్త బహుభిశ్చ (శ్చా)నుపాలితా (।) యస్యయస్యయదాభమితస్యతస్యతతఫలగ
87. పరదత్త వాయోహరేతు వసున్ధర (।) షష్టివర్షసహస్రని విషాయా జాయక్రిమి (॥)

ఏడవరేకు :: రెండవప్రక్క

88. దత్తహరయతాభూమి

❃ ❃ ❃

## 40. తిరుమలభట్టు శాసనం

ఇది ఒక విచిత్రమైన శాసనం. క్రీ. శ. 1589లో అనగా శక సంవత్సరం 1511 విరోధి నామ సంవత్సర నిజభాద్రపద శుద్ధ ఏకాదశి బుధవారంనాడు అక్షతల తిరుమలభట్టు అనే బ్రాహ్మణుడు బెజవాడ కురవసుపథం కట్టించాడని వున్నది.

మనకు సరియైన అర్థ వివరణ అందని మధ్యయుగం నాటి అనేక మాటలు వున్నాయి. అలాంటి మాటలలో కురవసుపథం కూడా వున్నది. ఈ మాటకు వివరణ తెలిస్తే అంతరించిపోయిన ఆచారం ఏమిటో తెలుస్తుంది.

ఈ అక్షతలభట్టు భారద్వాజస గోత్రీకుడని శాసనం వల్ల తెలుస్తున్నది. శిష్టాచార సంపన్నుడైన ఈ బ్రాహ్మణుడు లక్ష్మీనారాయణ యోగకాలంలో కురవసుపథం కట్టించాడట.

### శాసన పాఠం

1. శ్రీ । ఇంద్రాద్రేః పశ్చిమే
2. భాగే నృశింహ్వోయత్రతి
3. ష్ఠతి । తత్రస్యాత్వా హరిం
4. ద్రిష్ట్వ్యా పునర్జన్మం న విద్యతే
5. (1) స్వస్తిశ్రీ జయాభ్యుద
6. య శకవరుషాలు 1511
7. అగు నేటి విరోధి సంవత్స
8. ర నిజ భాద్రపద శు 11 బు
9. లక్ష్మీనారాయణ యో
10. గ మందు భారద్వాజస గో
11. త్రమైన అక్షతల తిరుమ
12. ల భట్టు నారాయణ ప్రీ
13. తిగాను బెజవాడ కు
14. రువసు పథంగాను
15. కటించను॥ శ్రీశ్రీశ్రీ

❀ ❀ ❀

## 41. అమ్మరాజ విక్రమాదిత్యుని తాటికొండ దాన శాసనం

ఇప్పటికి 1200 సవంత్సరాల క్రితం కృష్ణా జిల్లా ఎంత వైభవంగా ఉండేదో తెలియజెప్పే శాసనమిది. నిజానికి శాసనంలో తాంటికొండ అని వుంది. కాని తాడికొండగా నేడు ప్రసిద్ధమైంది.

క్రీస్తుశకం 808 నుంచి 847 వరకు ఈ ప్రాంతాన్ని నరేంద్ర మృగరాజ విజయాదిత్య మహారాజు పరిపాలించాడు. ఆయన క్రీ॥శ॥ 809లో విజయవాటి నగరం (నేటి విజయవాడ)లో తన పేరుతో సమస్త భువనాశ్రయ ఆలయం నిర్మించాడు. అది శివాలయం. మూడు అంతస్తులుగల గుడి. చిత్రవిచిత్రమైన అందమైన శిల్పాలు గల మందిరమది.

ఆలయం క్రమంగా శిథిలం కావడం మొదలైంది. 137 సంవత్సరాలు గడచింది. తరాలు మారినాయి. రెండవ అమ్మరాజు అధికారంలోకి వచ్చాడు.

ఈయన మహర్జాతకుడు. ఒక చేతిలో పద్మం, మరో చేతిలో చామరం, కలశం, రెండు అరికాళ్ళలో అంకుశ రేఖలతో పుట్టాడు. వయస్సులో అతడికి పెద్దవాళ్ళయిన సోదరులు ఉండగా ఎనిమిదవ ఏటనే మహారాజుగా నియమితుడయ్యాడు. పన్నెండేళ్ళ వయసురాగానే సింహాసనం అధిష్టించిన భాగ్యశాలి రెండవ అమ్మరాజ విజయాదిత్యుడు. విజయవాడను రాజధానిగా చేసుకొని క్రీస్తు శకం 945 నుంచి 970 వరకు ఎదురులేకుండా జనరంజకంగా పరిపాలించాడు. ఇతడు గజ, అశ్వ శాస్త్రాలలో మేటి. రాజనీతి శాస్త్రంలో తనకు తానేసాటి. మహావీరుడు. దీనజన యాచక చింతామణి. కవిగాయక వైతాళికులకు కల్పతరువు. శత్రుజనులకు మహాకాలభైరవుడు. ఎంత దయార్ద్ర హృదయుడో అంత చండ ప్రచండుడు. శైవమతావలంబి అయినా బౌద్ధ జైన మతాలను ఆదరించాడు.



మొదటి రేకు  రెండవ వైపు

తన పూర్వీకులు విజయవాడలో నిర్మించిన సమస్త భువనాశ్రయ ఆలయం శిథిలం కావడం చూడలేక పునరుద్ధరించాడు. నిత్యం బలి నివేదనలకు ఏర్పాటు చేశాడు. తపస్వుల భోజన వసతులకు సత్రం కట్టించాడు. ఆలయానికి సున్నం కొట్టించడానికి ఆర్థిక సదుపాయాలు కల్పించాడు. ఆలయ నిర్వహణకు గుండ్లకండేరువాటి విషయంలోని తాటికొండ, అమ్మలపూడి, అసులపఱ్ఱు, గొల్లపూడి (నేటి గుంటూరు జిల్లా) గ్రామాలను దానం చేశాడు. ఆ గ్రామాల మీద వచ్చే ఆదాయాన్ని ఎలాంటి పన్నులు లేకుండా ఆలయానికి చెందేటట్టుగా శాసనం వేయించాడు. ఆ శాసనాన్నే తాటికొండ అమ్మరాజ విజయాదిత్యుని శాసనమనీ, సంక్షిప్తంగా తాటికొండ శాసనమని అంటారు.

ఈ శాసనం ఇప్పటికి  సుమారు వంద సంవత్సరాల క్రితం నేటి గుంటూరు జిల్లా తాటికొండలో సత్యానందం అనే మాదిగ కులస్తుడు పాటిమన్ను కోసం మట్టిదిబ్బ తవ్వుతూ ఉండగా దొరికింది. ఆరు రాగిరేకుల గుది అది. కొన్ని రేకులు కరిగించివేసి సొమ్ము చేసుకోగా ఇప్పుడు మనకు ఆరు రేకులు మాత్రమే మిగిలాయి. వెయ్యి సంవత్సరాల క్రితం కృష్ణా మండలంలో వాడుకలో వున్న తెలుగు లిపి ఈ శాసనంలో కనిపిస్తుంది. ఈ లిపిని వేంగిచాళుక్య లిపి అంటారు. ఈ శాసన రచయిత అమ్మరాజు గురువు విద్యేశ్వర పండితుడు. కాలాముఖ శైవపీఠానికి అధిపతి. ఆ పీఠం విజయవాడలో ఉండేది.చక్కని సంస్కృత శ్లోకాలలో రచించినా లిపి మాత్రం తెలుగులోనే వుండడం ఈ శాసనంలోని విశేషం.

## శాసన పాఠం

మొదటి రేకు: రెండవవైపు

1. ఓం శ్రీవాగీశబ్జానామ్ స్వపాద నఖచంద్రమాః దేయా త్శివస్వయం శంవః
2. క్రియా కార్య్యాంహీ కారణమ్॥ స్వస్తి శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మాన
3. వ్యసగోత్రాణాం హారీతి పుత్రాణాం కౌశికీ వరప్రసాదలబ్ధరాజ్యానామ్మాతృగణపరిపాలితా
4. నాం స్వామిమహాసేననుదామధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాపాదిత వ(ర)
5. వరాహలాఞ్ఛ నేక్షణక్షణ వశీకృతానాం మణ్డలానా మశ్వమేధావభృధస్నాన ప
6. విత్రీకృతవపుషాం చాలుక్యానాం సలమలం కరిష్ణోస్సత్యాశ్రయవల్లభేన్ద్ర

7. స్య భ్రాతా కుబ్జరిష్ణువర్ధన నృపతి దుష్టాదశవర్షాణి వేంగిదేశ మపాలయత్
8. తదాత్మజోజయసింహస్త్రయ స్త్రింశత్ తదనుజేన్ద్ర రాజనన్దనో విష్ణువర్ధనో నవ॥ త
9. త్సూన మంగీయువరాజ పంచవింశతిం తత్పుత్రో జయసింహస్త్రయోదశ ॥ తదవ

రెండవరేకు :: మొదటివైపు

10. రజంకొక్కిలిష్షణ్మాసాన్ ॥ తస్య జ్యేష్ఠభ్రాతా విష్ణువర్ధన స్తముచ్ఛాబ్య సప్తత్రింశత ॥ తత్పు
11. త్రో విక్రమాదిత్య భట్టారకోస్యష్టాశ తస్పుతో విష్ణువర్ధన షట్త్రింశతణ తత్సూనుభార్యా
12. నుభాసో రణవిగణనయా నీలకణ్ఠాలయనాం: సగ్రామారామకాణాం సలలితరమణీ సం
13. సదాం సత్పదానాం కృత్వా ప్రోత్తుంగ మష్టోత్తరశత మభునగ్వీరధీనష్టయుక్తా నిశ్చత్వా
14. రింశత్సనూంక్మాం జనమత విజయాదిత్యనామా నరేన్ద్రః తత్పుత్రః కలివిష్ణువ
15. ర్ధనో ధ్యర్ధవర్షమ్ తత్సుతోను సదాంక విజయాదిత్య మహారాజశ్చతుశ్చత్వా
16. రింశతమ్ తదనుజ యువరాజ విక్రమాదిత్య వరపాత్మజః చాలుక్య భీమభూప స్త్రింశతమ్
17. వితస్పుత్రో విజయాదిత్యో ద్విషదిద్ధనవాటిక స షణ్మాసా నసౌ సాక్షా ద్విన్ద్రో భోవేణ భూ
18. మిసః॥ తత్సూను రమ్మరాజ స్సప్తవర్షాణి తత్పితామహో గుణగాంక విజయాదిత్యానుజ యు
19. ద్ధమల్లాత్మజః తాలాధిపో మాసమేకమ్ ఈ యుధి వినిహత్య చాలుక్య భీమాత్మజో విక్రమా

రెండవరేకు :: రెండవవైపు

20. దిత్య అదినికరతిమిరదినకరః ద్విజదీనానా బద్ధు రేకాదశమాసాన్ శతస్తాలపరాజనష్ట
21. సూనుస్స్వీకృతవాక్ప్రభు యుద్ధమల్లధరాధీశ స్సప్తవర్షా ణ్యహద్భువమ్ ॥ రక్షత్యాఙ్జునసన్ని
22. భో జనపదాత్తన్నిర్గమయ్యోద్ధతాన్దా యాదా వినభ్యామలీన భగణాకారా న్విధారోభిరాన్
23. వజ్రీవోర్జిత నాక మమ్మనృపతే భ్రాతా కవీయాన్భుమ భీమో భీమ పరాక్రమ స్సమభువన్ సవం
24. త్సరా ద్వాదశ 11 తస్య మహేశ్వర మూర్త్తినిరుమా సమానాకృతే మసారాద లోక
25. మహాదేవ్యా బలుయస్సమభవ దమ్మరాజాత్య జలజాతపత్ర చామరక
26. లశాంకుశ లక్షణాంక కరచరణకలశ లసదాజాన్వవలంబిత భుజయుగపరిఘో
27. సామజస్కః వివిధ ధరాధిపవిద్యో వివిధాయుతకోవిదో విలీనాకికుల కధిమ నాగమ
28. కుశలో హరచరణాంభోజయుగలమధుపః శ్రీమాన్ కవిగాయక కల్పతరు ద్విజముని దీ
29. నాన్ధబన్ధజన మనభిం యాచకగణ చింతామణి నవనీతమణి మ్మజ్జహోగ్రమముద్భవో

మూడవరేకు ::రెండవవైపు

30. మాహేశ్వరః గుడ్లకణ్ణేవ్వాడి విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖా న్కుటుంబినః సం
31. మాహూయే త్థమాజ్ఞాపయతి విదితమస్తు వః విజవాట్యాం చాలుక్య కులతిల
32. క సమస్తభువనాశ్రయ విజయదిత్యనరేన్ద్ర మృగరాజ ప్రతిష్ఠాపితాయ సమస్త
33. భువనాశ్రయ నామ దేవాలయ నివాసాయ ఉమామహేశ్వరాయ ఉత్తరాయణ నిమి
34. త్త అస్మద్దేశ సన్తత్యాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం తద్దేవాలయ ఖం
35. ణ్డ స్ఫుటిత నవకర్మ్మ బలినివేద్యాతోద్య సత్రప్రవర్తనార్థం చ అల్ప
36. వృత్తితయా ఆలూన విశీర్ణం పువర్ణ్ణవీ కర్త్తుం సర్వ్వకర పరిహారేణ దేవ(భో)(కృ)



రెండవరేకు మొదటి వైపు

37. త్యోందక పూర్వ్వం తాణ్డికొణ్డవామగ్రామః అమ్మలపూణ్డి గొల్లపూణ్డి ఆసువులపఋంగా

38. మాదిసమేతో స్మాభిర్దత్త ఇతి అస్య సగ్గ్రామస్యాటిక స్యావధయః పూర్వ్వతః తూ

39. ణ్ణేఋ ॥ అగ్నేయతః గారలగుణ్టి దక్షిణతి లామున యుత్తరంబున బూరుగు నైవృత్యతః

నాల్గవరేకు :: మొదటివైపు

40. ఒడ్డగుణ్ట ॥ పశ్చిమతః చయిత నామతటాతకమ్ వాయవ్యతః భీమసముద్రనా

41. మతటాక(మ్) ఉత్తరతః ఎనుకఋలు ఈశానతః రేగడుగుణ్ట ॥ యుగేయుగే

42. స్వీకృతరుద్రమూర్త్తయో మునీశ్వరాః శ్రీకులీశ్వరాదయః బభూవ రత్రానుగృహీతసజ్జనాః

43. స్వయంభువో ధర్మ్మయోపథప్రదర్శినః ॥ తదన్వయే కాలముఖాశ్రుతిముఖ్యాస్స్వయంభువో భువి

44. భూభృతా మభివన్ద్యా (ః) త త్సింహవర్షదస్తే స్థానస్యాస్యాధిపతయ ఇహ హితచ

45. రితాఃతేషా మమరవటేశ్వరా ద్యనేక పురాణ దేవాయతన నివాసి(నాం) కాలముఖా

46. నాం సంతతౌ లకశిపున్నిఖిలాగమ పారదృక్ పశుపతి మ్ముర్నిపోపి పతిశ్శ్రియః ॥ సుజ

47. లశాకపయః ఫలమూలకై ర్విహిత ధర్మ్మశరీర వివర్ద్ధనః యస్తమ్మనేశ్శిష్య ప్రభూత

48. పణ్డిత స్సాక్షాద్ధమ్మాకారశావం తచ్ఛిష్యా విద్యేశ్వర నామేశ్వరౌ తత్ప్రభూతరాశి భ్రాతృభువనరా

49. శిమునే శ్శిష్యో పశుపతి ప్రభూతరాశిశ్చ కాలముఖేన్ద్రాద్యపరనామా తచ్ఛిష్య పశుపతి పర



విజయవాడ అక్కన్న, మాదన్న గుహల సముదాయంలో గల శిథిల మండపం పైన గల అందమైన కుడ్య శిల్పం

# 42. రెండవ జయసింహుని పెణుకుపరు శాసనం

ఇది తూర్పు చాళుక్య వంశానికి చెందిన జయసింఘ మహారాజు వేయించిన తామ్ర శాసనం. ఎరడ్రోణశర్మ చతుర్వేద పారంగతుడు, సర్వశాస్త్ర విశారదుడు. ఆనాటి కమ్మరాష్ట్రంలో మహాపండితుడు. ఆయనకు సంక్రాంతి పండుగనాడు పెణుకపర్రు గ్రామంలో కొంత భూమిని జయసింఘవల్లభుడు దానం చేశాడు. ఈయనకు సకలలోకాశ్రయ అన్న బిరుదు వున్నది. ఆయన పెణుపర్రు దాన గ్రహీత వంశంతో ఎంతో అనుబంధం గలవాడని విదితమౌతున్నది. ఎరడ్రోణశర్మ తండ్రి దేవశర్మ. ఆయన అనేక యజ్ఞయాగాది క్రతువులు చేసినవాడు. ఆయన తండ్రి గుంజదేవ శర్మ. ఈయన కూడా చాలా గొప్పవాడే. ఆ వంశాన్ని జయసింఘ మహారాజు ఎంతగానో ఈ శాసనంలో ప్రస్తుతించాడు.



మొదటి రేకు

## శాసన పాఠం

### మొదటి రేకు

1. స్వస్తి । శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాంహారితీపుత్రాణాం
2. సప్తలోకమాతృభిః పరిపాలితానాం స్వామి మహాసేనపాదభక్తానాం భగవన్నారా
3. యణ ప్రసాదసమాసాదిత వరవరాహ లాంఛనేక్షణక్షణవశీకృతాశేషశ
4. త్రుమణ్డలానామ్మత్వమేధావభృథస్నాన పవిత్రీకృతవపుషాం చళిక్యానాం కుల
5. మలంకరిష్ణోః శ్రీ విష్ణువర్ద్ధనమహారాజస్య పౌత్రః శ్రీసర్వ్వలోకాశ్ర
6. యమహా రాజస్య పుత్రః స్వాసిధారా నమిత రాజన్యమకుటతటఘట్టిత
7. మణిమయూకపుఞ్జరీరఞ్జిత చరణయుగళ ప్రతాపవాన్ప్రసన్న వినివేశిత శక్తిత్రయ
8. పరమబ్రహ్మణ్యో మాతాపితృ పాదానుధ్యాతః సకలలోకాశ్రయ శ్రీజయ

### రెండవరేకు- మొదటిప్రక్క

9. సింఘవల్లభమహారాజః సర్వ్వానిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వోస్మాభిః వంగిపఱువస్తవ్యాయ
10. కౌణ్డిన్యగోత్రాయ తైత్తిరీయాయాప స్తంబసూత్రాయ గుంజదేవశర్మణః పౌత్రాయ సర్వ్వ
11. క్రతుయాజినో దేవశర్మ్మణః పుత్రాయ చతుర్వ్వేదపారగాయ సర్వ్వశాస్త్ర విశారదయః
12. శ్రీ ఎఱద్రోణశర్మ్మణేకమ్మరాష్ట్ర విషయ నివాసికుటుమ్బినః భవద్విషయే సర్వ్వాని



రెండవరేకు మొదటిప్రక్క

13. త్థమాజ్ఞాపయతి జ్యైష్ఠ్యాం పౌర్ణ్ణమాస్యాం సంక్రాన్తికాలే భూమిదాననిమిత్తే
14. గొబ్బడి విజ్ఞాపనాత్కర్మ్మరాష్ట్రే పెణెకపఱునామగ్రామే తస్య గ్రా
15. మస్యోత్తరపూర్వ్వస్యాన్దిశిక్షేత్రన్దత్తమస్య క్షేత్రస్య పూర్వ్వతోవధిః నిడుంగట్టతటా
16. కః దక్షిణతోవధిః పూసబోళక్షేత్రాన్తః పశ్చిమతోవధిః ఓంగోడు నుణ్డిళిగదేబుప
17. ళకు పోవుపన్థా ఉత్తరతోవధిః ఏష చోవధిఃతోటక్షేత్రం గ్రామస్యోత్తరతస్తః

**రెండవరేకు- రెండవప్రక్క**

18. టాకఃతస్యోత్తరారస్యాన్దిశి తస్య పూర్వ్వ తోవధిః కూపః దక్షిణతోవధిత
19. ఉత్తరతశ్చ జెద్దబోళక్షేత్రావధిః అస్యక్షేత్రస్య కూపద్వయమ్ తటాక ఏ
20. క కూప తాలతటాకస్య పూర్వ్వతః దక్షిణార్ద్ధే వ్రీహిక్షేత్రం చతుష్టయపరిమా
21. ణం ప్రాగపవర్గంచ గ్రామస్యేత్తర పూర్వ్వేదే శేగిరావకాశం ఏతచతురవధి
22. పర్య్యన్తం క్షేత్రం ధర్మ్మయశోభివృద్ధయే సర్వ్వకర పరిహారోపేతము దకపూ
23. ర్వ్వకం బ్రహ్మదేయీ కృత్యప్రాదామ్ అస్యసర్వ్వకరపరిహారోపేతస్య క్షేత్రస్యయో
24. బాధాంకరోతి స వారణాశ్యాంసహస్ర బ్రహ్మహత్యపాతక సంయుక్తో భవతి
25. యోన్యచ్ఛాసనమతిక్రమేత్సమేత్స పాపః శారీరన్దణ్డ మర్హతి సోపిపంచమహా

**మూడవరేకు**

26. పాతక సంయుక్తో భవతి భవన్తిచాత్ర శ్లోకాః భూమిదానాత్పరన్దాపన్న భూతన్న భ
27. విష్యతస్యైవ హరణాత్పాపెన్న భూతన్నభవిష్యతి స్వదత్తామ్పరదత్తాంవా
28. యోరే హరేత వసున్ధరామ్ షష్టిం వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః
29. బహుభిర్వ్వసుధాదత్తా బహుభిశ్చానుపాలినా యస్యయస్య యదా
30. భూమిస్తస్య తస్య తదాఫలమ్ ఆజ్ఞప్తి న్నిర వద్యసకలలోకాశ్రయ శ్రీపృథీ
31. విన్ధ్యాటవీష్వతోయాను శుష్కకోటరవాసిన కృష్ణహయో హి జాయన్తే బ్రాహ్మదేయాపహారకాః

మే 14, 2005న
విజయవాడ కలెక్టర్ క్యాంప్ కార్యాలయంలో విలేఖరుల
సమావేశంలో విలేఖరులకు కమిటీ ఏర్పాటు గురించి
కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూమాన్యువల్ కమిటీ చైర్మన్
శ్రీ కె. ప్రభాకరరెడ్డి, ఐ.ఏ.ఎస్.
వివరిస్తున్న దృశ్యం



**కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ కమిటీ తొలి ప్రచురణ 'విజయవాడ డివిజన్' గ్రంథం 15-5-2005 తేదీన ఆవిష్కరణ జరిగినప్పటి దృశ్యాలు...**




నాటి సభలో కమిటీ చైర్మన్ ప్రసంగిస్తున్న దృశ్యం

❋ ❋ ❋



అప్పటి జిల్లా కలెక్టర్, కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ ఎడిటర్ శ్రీ కె. ప్రభాకరరెడ్డి గ్రంథాన్ని ఆవిష్కరించిన అనంతరం పుస్తకాన్ని స్పాన్సర్ చేసిన ఎస్. రామారావు, గుత్తికొండ సుబ్బారావు, విజయవాడ కమిషనర్ ఉషారాణి, ఇమ్మడిశెట్టి అక్కేశ్వరరావు మెమోరియల్ ట్రస్ట్ సెక్రటరీ ఐ. సంతోష్ చక్రవర్తి, లంక వెంకట రమణ, డా. జి.వి. పూర్ణచంద్, పర్వతనేని శాంతి కిశోర్‌లతో పాటు సభకు పుస్తకాన్ని చూపిస్తున్న దృశ్యం

# కృష్ణావైభవం

2005 నవంబర్, 27, 28 తేదీలు కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ కమిటీ కార్యక్రమాలలో ముఖ్యమైన రోజులు. విజయవాడ సిద్ధార్థ మహిళా కళాశాల వేదికపై ఆ రెండు రోజులలో కృష్ణా వైభవం కార్యక్రమాలు వైభవంగా జరిగాయి.

వేదపఠనంతో సభ ప్రారంభం కావడానికి ముందు ముఖ్య అతిథి డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి, ఐ.ఏ.ఎస్., కమిటీ చైర్మన్ శ్రీ కె. ప్రభాకరరెడ్డి, ఐ.ఏ.ఎస్.లను కమిటీ సభ్యుడు శ్రీ ఇమ్మడిశెట్టి రామ్‌కుమార్ ఘనంగా సత్కరించారు.

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలెక్షన్ కమిషనర్ డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్న ఈ సభకు కమిటీ ఛైర్మన్ శ్రీ కె. ప్రభాకరరెడ్డి అధ్యక్షత వహించారు. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి జె. వసంతకుమారి స్వాగతం పలికిన ఈ సభలో కళాశాల డైరెక్టర్ శ్రీమతి ఆర్. రమాదేవి పాల్గొన్నారు. తొలుత వివిధ ప్రదర్శనలను డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి, శ్రీ ప్రభాకరరెడ్డి, సిద్ధార్థ అకాడమీ ప్రెసిడెంట్ శ్రీ పి.ఎల్.ఎన్. ప్రసాద్ ప్రారంభించారు.

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్, ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్, దివి ఐతిహాసిక పరిశోధక మండలి సహకారంతో న్యూమాన్యువల్ కమిటీ కృష్ణా జిల్లా శాసనాలు, కమిటీ సభ్యుడు పర్వతనేని శాంతి కిశోర్ సహకారంతో ప్రాచీన నాణేల ప్రదర్శన, ఆర్కియాలజీ, ఆర్కైవ్స్ శాఖల కృషిని రేఖామాత్రంగా నిర్వచించే ప్రదర్శన, మహిళా కళాశాల విద్యార్థినులు తయారుచేసిన చార్టుల ప్రదర్శన సందర్శకులను ఎంతగానో ఆకర్షించాయి.

అనంతరం జరిగిన సభలో న్యూ మాన్యువల్ కమిటీ ప్రచురణలు ''కృష్ణాజిల్లా గ్రామదేవతలు'' (శ్రీ దుర్గామల్లేశ్వర దేవస్థానం సౌజన్యంతో ప్రచురణ), ''కృష్ణా శాసన స్రవంతి'' (వి.జి.ఎస్. పబ్లికేషన్స్ అధినేత శ్రీ శీరం రామారావు సౌజన్యంతో ప్రచురణ) పుస్తకాల ఆవిష్కరణ జరిగింది.

సభలో డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి ప్రసంగిస్తూ, కృష్ణా జిల్లాలో తన అనుభవాలను గుర్తుచేసుకొన్నారు. మహోజ్వలమైన చరిత్రగల ఈ జిల్లా చరిత్రను సర్వజన విదితం చేయడానికి కమిటీ చేస్తున్న కృషిని ప్రశంసించారు. అంతకు ముందు



''కృష్ణాజిల్లా గ్రామదేవతలు'' పుస్తకాన్ని ఆవిష్కరించినప్పటి దృశ్యం

శ్రీ కె. ప్రభాకరరెడ్డి తమ ప్రసంగంలో కమిటీ అవతరణ నేపథ్యాన్ని, లక్ష్యాలను వివరించారు. శ్రీ పి.ఎల్.ఎన్. ప్రసాద్ కమిటీ కృషిని కొనియాడారు.

లాంఛనపూర్వకమైన సమాపన కార్యక్రమం 28వ తేదీ జరిగింది. ముగింపు సభకు కమిటీ సభ్యుడు శ్రీ పర్వతనేని శాంతికిశోర్ అధ్యక్షత వహించారు. ఈ సభలో ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ గోకరాజు గంగరాజు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

అకాడమీ ప్రెసిడె ట్ శ్రీ పి.ఎల్.ఎన్. ప్రసాద్, శ్రీ గంగరాజు, స్టేట్ ఆర్కైవ్స్ అసిస్టెంట్ డైరెక్టర్ శ్రీ ఎస్. రామకృష్ణలను కమిటీ సభ్యుడు శ్రీ డి. రామకృష్ణ సత్కరించారు. న్యూ మాన్యువల్ అసిస్టెంట్ ఎడిటర్స్ శ్రీ లంక వెంకట రమణ, డాక్టర్ జి.వి. పూర్ణచంద్ సూత్రధారులుగా రెండు రోజుల కార్యక్రమాలు జరిగాయి.



''కృష్ణా శాసన స్రవంతి'' ని డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి విడుదల చేసిన దృశ్యం




జ్యోతి ప్రజ్వలనం చేస్తున్న శ్రీ కె. ప్రభాకరరెడ్డి




ప్రసంగిస్తున్న డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి



డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డిని నూతన వస్త్రాలతో
సత్కరిస్తున్న శ్రీ ఐ. రామ్‌కుమార్.
శ్రీ ఎస్. రామారావు, శ్రీ శాంతికిశోర్‌లను చూడవచ్చు



కార్యక్రమాలు విజయవంతం కావడానికి ఎంతగానో
సహకరించిన మహిళా కళాశాల విద్యార్థినుల సేవల
ప్రశంసకు గుర్తుగా సర్టిఫికెట్లపై సంతకాలు చేస్తున్న
డాక్టర్ ఎ.వి.ఎస్. రెడ్డి

శ్రీ కె. ప్రభాకరరెడ్డిని నూతన వస్త్రాలతో సత్కరిస్తున్న
శ్రీ ఐ. రామ్‌కుమార్






శ్రీ గోకరాజు గంగరాజుకు సత్కారం జరిగిన సన్నివేశం

శ్రీ పి. ఎల్.ఎన్. ప్రసాద్‌ను శ్రీ డి. రామకృష్ణ
సత్కరించినప్పటి దృశ్యం






శ్రీ ఎస్. రామకృష్ణను లంక వెంకటరమణ, డి. రామకృష్ణ
కలసి సత్కరిస్తున్న దృశ్యం

# వ్యాసపర్వం

ఇందులో....



# కృష్ణాజిల్లా అవతరణ నేపథ్యం

- డా. చల్లా చంద్రమౌళి

వ్యాపారం కోసం ఈస్టిండియా కంపెనీ తూర్పుదేశాలను చుట్టపెట్టే ప్రయత్నం చేసింది. ఒక దేశంలో చవకగా లభించే సరకులను కొనుగోలుచేసి మరో దేశంలో అమ్మేది. మారుబేరాలు చేసే ఈ బేహారి సంస్థ మొదటిసారిగా క్రీ॥ శ॥ 1611లో 'గ్లోబ్' అనే నౌకలో మచలీపట్టణం చేరింది. క్రమంగా బలపడింది. కాలనీని ఏర్పాటు చేసుకొన్నది. అప్పటికే బందరు చేరి కోట కట్టుకొన్నారు డచ్‌వాళ్ళు (కోట కట్టుకొన్నారో, ఆక్రమించుకొన్నారో స్పష్టంగా తెలియదు). ఇంగ్లీషువాళ్ళ ధాటికి తట్టుకోలేక మూటముల్లె కట్టుకొన్నారు. దీనికి తగినట్టు వాళ్ళ మధ్య యుద్ధాలు మొదలయ్యాయి. ఫ్రెంచ్‌వాళ్ళు వచ్చారు. ఫ్రెంచ్‌వాళ్ళను త్రోసిరాజని 1759 ఏప్రిల్ 8వ తేది రాత్రి మచలీపట్టణాన్ని ఈస్టిండియా కంపెనీ స్వాధీనం చేసుకొన్నది.

కాలనీని అధికార కేంద్రంగా మార్చుకొన్నది. పాలనా వ్యవహారాలన్నీ మచలీపట్టం కౌన్సిల్ నిర్వహణలో సాగేవి. నక్క- కోతుల తగాదా కథలాగా ఈ ప్రాంతంలో జమీందార్ల మధ్య తంపులు పెట్టి మొత్తం స్వాహా చేసింది. పరిపాలన ఒడుదుడుకులతో సాగింది. బ్రిటిష్ పార్లమెంటు మచలీపట్టణం కౌన్సిల్‌ను 1794లో రద్దు పర్చింది. జిల్లా కలెక్టర్ల వ్యవస్థను ఏర్పాటు చేసింది. అప్పటివరకు మచలీపట్టణం జిల్లాగా పిలవబడుతున్న ప్రాంతం నుంచి గుంటూరు ప్రాంతం (లేదా కొండవీడు ప్రాంతం) వేరుపడింది. గుంటూరు జిల్లాగా అవతరించింది.

గుంటూరు జిల్లా వేరుపడగా పరిశేషమైన ప్రాంతం మచలీపట్టణం జిల్లా అయింది. మచలీపట్టణం జిల్లాపై ప్రకృతి కన్నెర్ర చేసింది. వరదలు, తుపానులు. అయితే అతివృష్టి లేదా అనావృష్టి. కరవులు- కాటకాలు. నిరంతరం అంటు వ్యాధులు. ప్రతి సంవత్సరం వేలాది మంది మశూచి, కలరా, ప్లేగు, తదితర వ్యాధులతో మరణించేవారు. అవిద్య, అజ్ఞానం అనే చీకట్లో ప్రజలు కొట్టుమిట్టాడేవారు. బాల్య వివాహాలు, సహగమనాలు అధికంగా జరిగేవి.

ఈస్టిండియా కంపెనీ పన్నులు వసూలు చేసే బాధ్యతను జమీందార్లకు అప్పగించింది. ఈ జమీందార్లలో చాలా మంది జలగల్లాంటి వాళ్ళు. ప్రజలను పీడించేవాళ్ళు. నేరుగా రైతుల నుంచి, పరోక్షంగా జమీందార్ల ద్వారా కూడా కంపెనీ పన్నులు వసూలు చేసేది. మధ్య యుగాల్లో మహారాజులు తను సామంత రాజుల నుంచి కప్పం వసూలు చేసినట్లే కంపెనీ ప్రభుత్వం జమీందార్ల నుంచి పేష్కస్ వసూలు చేసింది. వసూలు చేసిన జిల్లా కలెక్టర్లకు కమీషన్ చెల్లించేది.

కరణాలు అవినీతిపరులయ్యారు. ప్రజలను శిస్తు రూపంలో జలగల్లాగా పీడించేవారు. పోలీసులు రాక్షసంగా ప్రవర్తించేవాళ్లు. మొత్తంమీద ప్రభుత్వంలో ఏ అంగమైనా దుష్టాంగమే అయింది. ప్రభుత్వం కుళ్ళిపోయింది. క్రమంగా బ్రిటిష్ పార్లమెంటు కలుగజేసుకోక తప్పలేదు. మచలీపట్టణం కౌన్సిల్ రద్దు అయి కలెక్టర్లు వచ్చినా పరిస్థితి బాగుపడలేదు. నిజానికి 1773లోనే కంపెనీ పాలనను నియంత్రిస్తూ చట్టం చేసింది. ఆ చట్టం ప్రకారం గవర్నర్ జనరల్‌కు అధికారాలు సంక్రమించాయి. ఫలితం కనిపించలేదు. పరిస్థితి నానాటికి తీసికట్టుగా మారడంతో 1784లో పిట్స్ ఇండియా చట్టం చేసింది. ఆ చట్టం ప్రకారం జిల్లా పరిపాలన గవర్నర్ జనరల్ అధీనంలోకి వచ్చింది. కంట్రోల్ బోర్డు ఏర్పడింది. అయినా కూడా పాలనా వ్యవస్థ బాగుపడలేదు. 1813లో పార్లమెంటు ఛార్టర్ చట్టం చేసింది. ఆ విధంగా పార్లమెంటుకు విశేష అధికారాలు సంక్రమించాయి. ఒక్క తేయాకు వ్యాపారం మినహా కంపెనీ ఏ వ్యాపారం చేయడానికి వీలులేకపోయింది. మచలీపట్టణం జిల్లాలో తేయాకు వ్యాపారమే లేదు కదా!

ఈ విధంగా ఈస్టిండియా కంపెనీ వ్యాపార సంస్థగా అస్తిత్వం కోల్పోయి కేవలం పరిపాలనా యంత్రాంగంగా మారింది. 1833లో పార్లమెంట్ మరో ఛార్టర్ చట్టం చేసింది. దీనితో కంపెనీ నామమాత్రావశిష్టమైంది. అయినా తన అసమర్థతను, అశక్తతను కప్పిపుచ్చుకొంటూ పరిపాలనా సామర్థ్యం పెరగాలంటే ఏమి చెయ్యాలో పార్లమెంట్‌కు రకరకాల సూచనలు చేసింది.

1794లో మచలీపట్టణం జిల్లా నుంచి విడిపోయిన గుంటూరు జిల్లాను మళ్లీ విలీనం చెయ్యాలని వాకర్ కమిటీ సూచించింది. 1833లో పార్లమెంట్ మరో ఛార్టర్ చట్టం వచ్చిన దరిమిలా కంపెనీ తన వ్యవహారాలు చక్కదిద్దుకోవడానికి గడువు కోరింది. ఆ విధంగా లభించిన 20 సంవత్సరాల వ్యవధానంలో చాల పాడు పనులు చేసింది. కులాల మధ్య చిచ్చురేపింది. జమీందారుల మధ్య వైషమ్యాలు పెంచింది.

బ్రిటిష్ పార్లమెంటు అనాలోచితంగా 1859లో గుంటూరు జిల్లాను కలిపి కృష్ణాజిల్లాను ఏర్పాటు చేసింది. ఇది గుంటూరు జిల్లాలో దోపిడీ వర్గాలకు గిట్టలేదు. దోపిడీ వర్గాలకు తాబేదార్లు ఉంటారు. కొన్ని కులవర్గాలు తాబేదారీ చేస్తాయి. ఆ వర్గాలతో ప్రభుత్వం చేతులు కలిపింది. అప్పటికే చెడిపోయిన గుంటూరు జిల్లా స్థితిగతులపై ఇలియట్స్ కమిటీతో దర్యాప్తు జరిపించింది. వాల్టర్ ఇలియట్స్ మచలీపట్నం జిల్లాలో గుంటూరు జిల్లాను కలపాలని సిఫారసు చేశాడు. అలా ఏర్పడిన జిల్లాను కృష్ణా జిల్లా అన్నారు. ఆ సిఫారసు మేరకు 1859లో కృష్ణాజిల్లా ఏర్పడింది. నేటి గుంటూరు జిల్లాతో కలసిన కృష్ణా జిల్లా (ఇందులో నేటి పశ్చిమగోదావరి కూడా ఉన్నది)లో పరిస్థితులు దారుణంగా మారాయి. ఒకవైపు ఆంధ్రోద్యమం, జాతీయోద్యమాలతో అప్పటి ప్రభుత్వం తల్లిడిల్లింది.

కృష్ణా జిల్లాను పాలనాపరంగా విభజించడం సముచితమని బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం భావించి 1904లో గుంటూరు జిల్లాను వేరు చేసింది. ఈ విభజన వల్ల అప్పుడప్పుడే రూపు దిద్దుకొంటున్న జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం విఫలం కాగలవని ప్రభుత్వం భావించింది.

1904 నుంచి నేటి కృష్ణా జిల్లాలో పశ్చిమగోదావరి, ఖమ్మం జిల్లాలో కొంత కలసి కాపురం చేశాయి. 1925లో పశ్చిమ గోదావరి జిల్లాని విభజించారు. అంటే ప్రస్తుత కృష్ణాజిల్లా రూపొందిందన్నమాట.

భారత జాతికి ధూమకేతువైన బ్రిటిష్ సామ్రాజ్యం అంతరించి 1947 ఆగస్టు 15న స్వతంత్ర దేశంగా అవతరించింది. అనేక దశాబ్దాల ఆందోళన పర్యవసానంగా ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఫజలాలీ కమిషన్ సిఫారసు ప్రకారం భాషాప్రయుక్త రాష్ట్రంగా 1955 నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

వాల్మీకి కవి చక్రవర్తి 'అపి స్వర్ణమయం లంకా' అన్నట్టు భావికాలంలో కవిగాయక వైతాళికులు 'స్వర్ణమయం కృష్ణా' అని కృష్ణా జిల్లా వైభవాన్ని కీర్తించగలరని ఆశిద్దాం.



225 సంవత్సరాలనాటి
కృష్ణాజిల్లా కలెక్టర్ కార్యాలయం



# దివిసీమలో వెలుగుచూడని విశేషాలు

**మండలి బుద్ధ ప్రసాద్**
శాసన సభ్యుడు, అవనిగడ్డ నియోజకవర్గం, కృష్ణాజిల్లా

పాత కథలు ఏవైనా వినగా, వినగా విసుగు పుడతాయి. కొత్త కథలు వినాలనిపిస్తుంది. ఎవరికైనా! అలాగే చరిత్ర కూడా! కొత్తగా వెలుగులోకి వచ్చిన విశేషాలు సహజంగానే ఆసక్తి కలిగిస్తాయి.

దివిసీమ చరిత్ర చెప్పే వాళ్లంతా గణపతిదేవుడు - జాయపసేనాని- నారమ్మ పేరమ్మ కథలు తప్పకుండా చెబుతారు. వినగా వినగా - అంతకంటె ఈ సీమకు చరిత్ర లేదా అని రవ్వంత చికాకు అనిపిస్తుంది. అనిపిస్తుంది కాని చరిత్ర చెప్పే వాళ్లు, వినేవాళ్లు నిస్సహాయులు. నిజంగా నిస్సహాయులా? వాస్తవంగా నిస్సహాయులు కారు. అధ్యయనం చేస్తే ఎప్పటికప్పుడు కొత్త అంశాలు ఆవిష్కృతమవుతూ ఆసక్తి కలిగిస్తాయి.

ఆ దృష్టితో కృష్ణా జిల్లా కలెక్టర్‌గా పనిచేసిన కె. ప్రభాకరరెడ్డిగారు చొరవ తీసుకొని ఈ జిల్లా నూతన చారిత్రక విషయాలను వెలుగులోకి తెస్తున్నందుకు ఎంతగానో అభినందనీయులు. మా దివిసీమకు సంబంధించి ఇంతవరకు బయటకురాని అనేక విషయాలు కనుగొన్నందుకు ప్రజల పక్షాన కూడా ఆయన ప్రారంభించిన న్యూమాన్యువల్ కమిటీకి కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

కమిటీ సేకరించిన విశేషాలను కమిటీ మాత్రమే ప్రచురించితే బాగుంటుంది. అది న్యాయం కూడా! అయితే మా దివిసీమకు సంబంధించి నాలో ఎంతో ఆసక్తి కలిగించిన ఒక సామాజిక అంశం ఇక్కడ వివరిస్తాను. ఇది ఈ ప్రాంతపు నైసర్గిక, సామాజిక స్వభావాన్ని వివరిస్తుంది.

కాలగతిలో కొట్టుకుపోయిన ఈ విషయంపై పునశ్చరణ ఎందుకు అన్న ప్రశ్న చాలా మంది వేస్తారు. మా దివిసీమలో ప్రస్తుత పరిస్థితిని వివరిస్తాను. ఈ వివరణతో పునశ్చరణ అవసరం ఏమిటో బోధపడుతుంది.

మా దివిసీమలో నదీతీర గ్రామాలు ప్రవాహానికి కోసుకొని పోతున్నాయి. భూభాగాలు కోతపడి నదిలో కొట్టుకుపోతున్నాయి. నేల తల్లిని నమ్ముకొని జీవిస్తున్న రైతన్నలు నిస్సహాయులవుతున్నారు. వాళ్లను ఎలా ఆదుకోవాలి? ఇది ప్రశ్న. ఈ ప్రశ్నను, దీనికి లభించే సమాధానాన్ని విశ్లేషిస్తే ప్రజలలో బాధ్యతారాహిత్యం, నిబంధనలను కట్టుదిట్టంగా అమలు జరపడంలో అధికారుల నిస్సహాయత, నిర్లిప్తత... ఇలా ఎన్నో సంగతులు బయటపడతాయి. వీటికి వివరణలు ప్రస్తుతానికి అనవసరమనుకొంటాను.

ఈ ప్రశ్న ఈనాటిది కాదనీ, ఇప్పటికి 210 సంవత్సరాలనాటిదని, న్యూ మాన్యువల్ కమిటీ కనుగొన్నది. విజ్ఞానం ఇంతగా వృద్ధి చెందని ఆ రోజుల్లో ఈ సమస్య ఎలా పరిష్కారమైందో తెలియదు గాని అధికారులు ఆనాడు స్పందించిన తీరు మాత్రం ముచ్చట కలిగించింది. ఈ పాతకథ సుదీర్ఘమైనదే! అంతా వినతగ్గదే! కమిటీ ద్వారా తెలుసుకొన్న ఆనాటి కథను క్లుప్తంగా వివరిస్తాను.

అవనిగడ్డకు అయిదుమైళ్ళ దూరాన కృష్ణానదిలో ఎడ్లంక అనే గ్రామం వుంది. ఇప్పటికి కూడా వరదలు బాగా వస్తే ఆ గ్రామానికి బయట ప్రపంచంతో సంబంధాలు ఉండవు. మరి అది ఒక దీవి కదా! ఈ ఊరికి అవతల సరిహద్దులు నేటి గుంటూరు జిల్లాలోని కామరాజుగడ్డ, మోర్తోట, విశ్వేశ్వరం గ్రామాలు. ఈ గ్రామాల మధ్య వివాదమే ప్రస్తుత అంశం. 1795వ సంవత్సరం ఏప్రిల్ మొదటివారంలో ఈ మూడు గ్రామాలేగాక అవనిగడ్డ, నాగాయలంక గ్రామాలు ఎలా వివాదపడ్డాయో నిజంగా ఆసక్తి కలిగించే అంశం.

అటు విశ్వేశ్వరం, కామరాజుగడ్డ ఇటు ఎడ్లంక గ్రామాల తీర రేఖలు వరద వచ్చినప్పుడల్లా కోసుకు పోవడం ఈనాడు జరగుతున్నట్టే జరిగేది. ఆ విధంగా రైతులు తమ

భూ వసతులు కోల్పోయేవాళ్ళు.

కాలం చేసే గారడీ ఎప్పుడూ ఒకే విధంగా ఉండదు కదా! ఈ మూడు గ్రామాల మధ్య కొత్తగా లంకలు ఏర్పడేవి. మరి ఈ కొత్త భూభాగాలపై హక్కులు ఏ గ్రామాల రైతులకు ఉండాలన్నది వివాదం. ఈ గొడవలు రెండు జిల్లాల అధికార యంత్రాంగాలనే కాక అప్పటి రాష్ట్ర ప్రభుత్వాన్ని కంపింపజేశాయి.

ఈ తగాదా పరిష్కార బాధ్యత అప్పుడే కొత్తగా ఏర్పడిన (1775) జిల్లా కలెక్టర్ల వ్యవస్థపైన పడింది. కొత్తలంకలపై హక్కులు ఎవరివో నిర్ణయించే ముందు ప్రస్తుత సరిహద్దుల నిర్ధారణ జరగాలి కదా! ఆ నిర్ధారణ విచిత్రంగా ఉండేది. అది శాస్త్రీయమా కాదా అన్నది వేరే విషయం. ప్రజల విశ్వాసాలను, సంప్రదాయాలను ఆనాటి తెల్లదొరలు గమనించి గౌరవించారు. నియమ నిబంధనలను ఎవరైనా సవాల్ చేస్తారు. సంప్రదాయాలను, ఆచారాలను ప్రశ్నించరు కదా! ఆనాటి అధికారుల చాతుర్యంతో నిబంధనలు కంటె ఆచారాలు గొప్పవని భావించి గ్రామాల మధ్య వివాదాన్ని ఎలా పరిష్కరించారో చూదాం!

ఆ రోజుల్లో ఎడ్లంకలో మైనేని బాపయ్యగారు అనే పెద్దమనిషి ఉండేవాడు. గ్రామ పెద్ద కావచ్చు. అటు విశ్వేశ్వరంలో యార్లగడ్డ వంశీకులు గ్రామ పెద్దలు. కామరాజుగడ్డ గ్రామంలో కామరాజుగడ్డ వంశీకులు పెద్దలు.

గ్రామ పెద్దలను పిలిపించారు అధికారులు. ఊరు పెద్దలు కృష్ణానదిలో స్నానం చేయాలి. తరువాత ఊరులోని గుడిలో దైవదర్శనం చేసుకోవాలి. మెడలో తులసిమాల వేసుకోవాలి. నెత్తిమీద రామాయణం పెట్టుకొని అప్పటి సరిహద్దులను తొక్కుతూ తిరిగి గుడికి చేరాలి. అలా ఎడ్లంకలో బాపయ్యగారు కృష్ణలో స్నానంచేసి వినాయకుడి గుడిని దర్శించారు. విచిత్రమేమంటే నేడు ఆ గుడి లేదు.

ఈ తంతు జరగడానికి ముందు ఆ గ్రామ పెద్ద అస్తిపాస్తులు, స్థిర చరాస్తులు, కుటుంబ సభ్యుల వివరాలు తెలుసుకొంటారు. సరిహద్దుల నిర్ధారణ జరిగిన 20 రోజులు తరువాత మళ్ళీ వివరాలు తీస్తారు. ఆ గ్రామపెద్ద ఇంటిలో ఈ 20 రోజుల వ్యవధిలో ఏదైనా నష్టం వాటిల్లితే ఆ నిర్ధారణ సరియైనదికాదని విశ్వాసం. అటువంటిదేదైనా జరిగితే మళ్లీ మరొకరితో గ్రామ సీమల నిర్ధారణ చేయిస్తారు.

సరిహద్దులను ఖరారు చేయడంలో చిన్న మతలబు ఉన్నది. ఒక్కొక్క సారి గ్రామ తీర రేఖకు కోతపడడంతోపాటు కొత్తగా మట్టిచేరి లంక విస్తీర్ణం పెరుగుతుంది. పెరిగిన విస్తీర్ణం మేరకు రైతులు పొలాల విస్తీర్ణం కూడా పెంచుకొంటారు. ఎంత పెంచుకొన్నారో లెక్కతేలుతుంది. ఆ దామాషాలో కొత్తగా ఏర్పడిన లంకలో భూ వసతి కల్పిస్తారు. కోతవల్ల కోల్పోయినవారికి కొత్తలంకలో వసతి లభిస్తుంది.

ఇది ఎంత వరకు శాస్త్రీయమో తెలియదుగాని ఆనాటి అధికారులు చాకచక్యంగా ఈ సంప్రదాయాన్ని పాటించి వివాదాన్ని పరిష్కరించారు. ఆ విధంగా పరిష్కారమైనప్పుడే కొత్తఎడ్లంక ఏర్పడింది.

సరిహద్దుల నిర్ధారణ జరిగిన తరువాత మర్రిమొక్కలు నాటేవారు. మర్రి మొక్కలు పెరిగి వటవృక్షాలై కలకాలం నిలబడతాయి కదా!

ఆనాటి ఎడ్లంక గ్రామ సీమల నిర్ధారణ కార్యక్రమానికి అసిస్టెంట్ కలెక్టర్ వైట్, గుంటూరు జిల్లా నుంచి అఫైరె హాజరయ్యారు.

ఆశ్చర్యకరమైన మరో విశేషమేమంటే ఎడ్లంక గ్రామం సరిహద్దులు దిగ్భ్రాంతికరంగా వున్నాయి. అవనిగడ్డ గాలిగోపురంను ఆనుకొన్న కరకట్ట ఒక సరిహద్దట. 15వ శతాబ్దంలో నేటి చిరివోలు గ్రామానికి ఒక సరిహద్దు ఎడ్లంక. ఎక్కడ ఎడ్లంక! ఎక్కడ చిరివోలు!! కనీసం 20 కిలోమీటర్ల దూరం. మధ్యలో నేడు కనిపించుతున్న గ్రామాలు ఆనాడు ఎక్కడ ఉండేవో ఊహించలేము.

ఇలాంటి చిత్రవిచిత్రమైన చారిత్రక విశేషాలను వెలుగులోకి తెస్తున్న కృష్ణా జిల్లా న్యూ మాన్యువల్ కమిటీని, ఒంటి చేత్తో దానిని నిర్వహిస్తున్న ప్రభాకరరెడ్డి I.A.S. గారిని అభినందించకుండా వుండలేను. ●



# కొత్త నృత్య సంప్రదాయానికి అభివ్యక్తి అవనిగడ్డ ఆలయం

-మారిశెట్టి విజయలక్ష్మి

ఆరాధనా మందిరాలు చరిత్ర అధ్యయనానికి ఊటవెల్లువలు. ఆలయాలు వాస్తు, శిల్పాలు, అక్కడ తాపటం చేసిన శాసనాలు నిర్మాణ కాలం నాటి పరిపాలన గురించి, సామాజిక స్థితిగతుల గురించి వివరిస్తాయి.

ఆలయాలు కేంద్రాలుగా సంగీత, నృత్య సాహిత్యాలు వృద్ధి చెందాయి. ప్రజలకు మతం పట్ల విశ్వాసం ఎంత బలంగా ఉండేదో గుడులు గోపురాలు వ్యక్తం చేస్తాయి. లలితకళల పట్ల ప్రజల అభినివేశం, దాన ధర్మాల పట్ల అనురక్తి ఎంత ప్రబలంగా ఉండేవో కూడా చాటి చెబుతాయి. ధర్మనిష్ఠ, సత్యనిరతికి గుడులు నిలువుటద్దాలు. తాను నిజమే చెబుతున్నానని గుడిలో దీపం వెలిగించటం ప్రతివాదుల సత్యనిష్టకు నిదర్శనం.

నిరతాన్నదానానికి, విద్యాభ్యాసానికి, వైద్యశాస్త్రంలో ప్రజ్ఞావంతులైన అర్చక స్వాములు రోగ పీడితులకు మందులు ఇచ్చే వైద్యశాలలుగా భాసిల్లిన కాలం వుంది. ప్రజలు ధర్మవర్తనులై జీవించడానికి అవసరమైన ధర్మప్రచార కేంద్రాలుగా కూడా ఆలయాలు పేరెన్నిక గన్నాయి.

కృష్ణా జిల్లాలోని ఆలయాలు ఒకప్పుడు భక్తి ప్రచారోద్యమం ఎంత బలీయంగా జరిగిందో నిరూపిస్తాయి. ఇందుకు నిదర్శనాలు కృష్ణా జిల్లాలోని ఏ అలయంలోనైనా లభిస్తాయి. ముఖ్యంగా అవనిగడ్డ మండలం అవనిగడ్డలో వేంచేసిన లక్ష్మీనారాయణస్వామి ఆలయాన్ని ఉదాహరణగా చెప్పుకోవాలి. వెలనాటి గొల్లంకరాజు ఉద్యోగి బంధువు వకరు వేయించిన శాసనం ఒకట ఆ గుడిస్తంభంపైన ఉంది. అది గొంకరాజు వేయించినది. విజయవాడలో కూడా ఒకటి వుంది. ఈ ఆలయంలో గల ఆరు శాసనాలు దక్షిణభారత శాసన సంపుటాల్లో ప్రకటితమయ్యాయి. కాకతీయ ప్రభువుల సామంతరాజులు, కాపయనాయకుడు, కులోత్తుంగ చోడుడు, వెలనాటి గొంకరాజులు వేయించిన శాసనాలు అవి.

ఆలయం ముందుగల సూర్య రథానికి మెట్లు చెక్కి ఉన్నాయి. ఈ మెట్ల మీద శాసనాలు ఉండేవనీ, అవన్నీ చెరిగిపోయినాయని సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు బి.ఎన్. శాస్త్రి శ్రీమాన్ దీని నరసింహాచార్యులు వ్రాశారు.

ఏ శాసనమైనా దానికిగా అది వెలుగులోకి తెచ్చే చరిత్ర స్వల్పంగానే ఉంటుంది. అయితే ఆ శాసన ప్రకటన కర్త మరో ప్రదేశంలో వేయించిన శాసనాలు, ఆయన సమకాలీనులు చేసిన శిలా ప్రకటనలతో అన్వయించి అధ్యయనం చేస్తే గొప్ప చరిత్ర ఆవిష్కృతమవుతుంది. ఆ విధంగా అవనిగడ్డ ఆలయంలోని శాసనాలు గొప్ప చరిత్రను వెలుగులోకి తెస్తాయి. ఆ విధమైన తులనాత్మక పరిశీలనకు ఉపకరించేది రెండవ గొంకరాజు వద్ద పనిచేసిన ఒక ఉద్యోగి వేయించిన శాసనం అది.

వెలనాటి గొంకడు క్రీ.శ. 1152లో చందోలును రాజధానిగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పాలించాడు. ఆయన దివిసీమలోని అవనిగడ్డలోనే కాదు శ్రీకాకుళం, పెదకళ్లేపల్లిలో శాసనాలు వేయించాడు. దక్షిణ భారత శాసన సంపుటి నాల్గవ వాల్యూములో 945వ నంబరుతో ప్రచురితమైన ఆ శాసనంలో ఇలా వుంది.

"శక సంవత్సరం 1076 నందు కొల్లూరి విభుండు అయిన చింతమ నాయకుడు, అతడి భార్య అయిన గుండమకు జన్మించిన వెలనాటి రెండవ గొంకరాజు యొక్క ప్రతీహారి ముత్తమ నాయకుని కుమార్తె కొమ్మమ తనకు ధర్మముగా అఖండ జపము కొరకు బిరుదగద్యలు 16 సమర్పించెను. వీటిని చేకొని మానెడు నెయ్యి నిత్యము చోడనారాయణ దీపమునకు సమర్పించెను. వీటిని చేకొని మానెడు నెయ్యి నిత్యము చోడనారాయణ దేవరకు సమర్పింపచవలసి ఉన్నది."

ఈ శాసనంలో పేర్కొన్న రెండవ గొంకరాజు మహావీరుడు. ఇతడి భార్య సుబ్బమ, గొప్ప సౌందర్యవతి మంచి నర్తకి. దాక్షారామ భీమేశ్వరాలయంలోని పలు శాసనాలు ఆమె నృత్య వైభవాన్ని వర్ణించాయి. అవనిగడ్డ లక్ష్మీనారాయణ స్వామి ఆలయంపైన శిల్పాలు ఆంధ్రజానపద నృత్యం విశిష్ఠతను చాటి చెబుతున్నాయి. ఆలయం గాలిగోపురంపైన గల శిల్పాలు కోలాట నృత్యాన్ని అభివర్ణిస్తున్నాయి. సుప్రసిద్ధ కూచిపూడి నాట్య అధ్యాపకుడు పసుమర్తి కేశవప్రసాద్ అభిప్రాయంలో ఆంధ్రదేశంలో- ముఖ్యంగా కృష్ణా మండలంలో 'మత్తల్లి' అనే నృత్యరీతి వర్ధిల్లింది. ●

# DAMAGED ARCHIVAL MATERIALS AND THEIR CONSERVATION IN A.P. STATE ARCHIVES & RESEARCH INSTITUTE, HYDERABAD



**S. RAMAKRISHNA**
Asst. Director
State Archives

In this paper an attempt has been made to high light the repair methods adopted in A.P. State Archives and also the practical exercises and measures to take care of the records to save them from decay.

**Humidity** is the major factor in the decay of the documents

Relative humidity below 40% is one of the major factors to create dry conditions. All relative humidity above 70% denote moist conditions. R.K. Perthi observes that papers of the 18th and 19th centuries become brown and brittle. Whereas the Archives in Europe are still in good condition, the documents in tropical countries become sensitive to touch even if they belong to 20th century. Paper is a hygroscopic material and absorbs moisture. Moisture can weaken the tissue and affects the life and make the paper to loose its crispness.

**Dust** hooding the records is not only unhygienic to the keepers but is conducive to the growth of micro organisms injurious to the records. Dangerous influence of dampness etc., on record can be minimized by avoiding dampness in the rooms. Proper ventilation is a preventive measure.

Ranbir singh suggests that glass panel of lemon or bottle green colour should be used for windows of record rooms. All the gangways for main entrance should be 1.5 meter wide. A maximum height of 2.20 meters is desirable so that shelves are easily accessible.

**Acidity** damages the paper. W.J. Barrow first devised a method of de-acidificaion using saturated lime water and calcium bicarbonate (0.15%)

**Fungi** are very dangerous and its attack can be easily identified by fuzzy growth, mostly coloured. Stagnant air can become a cause for fungi growth. High temperature and high humidity promotes the growth of fungus. Fungus is impossible to define exactly.

Hari Narayan listed that penicillium, Feesarium, Trichoderma, Alternaria Citromyces, Aspergillus and Monilia are enemies of records.

Psocides damage and decolours the paper severely.

**Silver Fish** belongs to Thysanura family. They have a life cycle of 2 to 3 years. They are particularly fond of flour glue and photographic gelatin and penetrate books from the back cover. They produce superficial erosions

of irregular shape on paper. In shape and movement it much resembles to fish and hence it is called Silver Fish. A temperature range between $16^0$c to $23^0$c and relative humidity above 55% provide favourable conditions for its growth and multiplication.

**Wood- worm** belongs to the species of Anobidae and Lyctide of the order of Coeleopteran. They make oval holes inside the books.

**Black beetles** cause surface damage and are fond of paper parchment. They lay eggs on the edges of the books preferably in the bottom and edges.

**Cockroaches** damages the books on its edges and cause staining of the paper. The common target of attack by these insects are bound volumes. They defile books by chewing their surface. The objects are mostly attacked by the termites and wood- louse. Any article made of paper and the material rich in cellulose are good food to these creatures.

**The Termites** have destructive activity and characterized by tunnel shaped holes with an irregular erosion of material going from the edge to the inside. They are the most pernicious menace to archive materials.

Fumigation is extremely important for rehabilitation of records

Fumigation of a room may be carried out by using a mixture of 1 lb of aqueous Formaldehied and 602g of solid permanganate for 1000- 1500C.

The operation of a vaccuum cleaner is gentle and it involves no violent handling of the documents . The dust sucked by vacuum cleaner is also not despersed into the surrounding air, but it is trapped ina collecting bag which may be taken out from time to time and carefully rid of all the dust collected. The cleaning of dust trapping but must be done out side the stack area.

If vacuum cleaner is not availabe the dust is to be removed with the help of a brush of soft, bushy bristles of hair.

Rehabilitation is pre-requisite to all the archived documents.

The first organized attempt for protecting the documents was made by keeper of Vatican Library, Cardinal Franz Ehrle with an appeal at International Congress of Library held in St. Gall in 1889 and later Archivists Conference held in Dresden in 1899.

**Lamination** W.J. Barrow has done poineering work in lamination. Lamination may be defined as the process in which a document is embedded between sheets of synthetic plastic film or tissue.

Use of glue must be avoided

For a protective coating to book bindings against attacks by cockroaches block has suggested the following solution.

| | |
|---|---|
| Ethyl cellulose | 10.5 ozs |
| Salicylanilide | 0.5 ozs |
| Butyl alcohol | 6.0 ozs |
| Xylene | 3.0 Quarts |

Thakur Das and Ranbin Kisher have sugested a thin paste for repair and use of Sarcell H.V. and Sarcell M.V. Sodium salts of Carboxy methyl cellulose.

**Silk Binding**

This process if quite expensive and is used only in exceptional cases where lamination can not be attempted. This process leads to the reinforcement of documents by pasting light, coarsely woven silk fabrics. Known as crepe line on each side of the paper.

Chiffon is a fine, white silk gauze that is very durable because it is a silk texture, quite flexible and transparent. The work of chiffon is to be carried out on a sheet of glass. First a thin layer of dextrin paste is applied to the glass sheet. Then a Chiffon pice is placed on the glass sheet and given a coat of paste with a flat brush.

C.P. Mehra says that the photographic material should be made of combustible non-stained and non-corrosive. Oxidation process. This technique will protect the image.

Saurwien suggests that Methyl Chloroform should be used for clarity in films. The files shluld be kept in a ventilated room.

Records are our memory and should be protected for posterity. The archival repositories in the districts are not taking proper care. The A.P. State Archives is imparting training to record keepers. Every major Library of Archived institution should have conservation and preservation laboratories with needed staff.

## Refereneces:

Perthi, R.K.:Management of Conservation of Papers, and Archives
Harinarayana, N:
The Science of Archives Keeping - PP,9
Ranbi Kishore :
Storage of Records NA, New Delhi.
Barrow, W.J.:
American Archivist, Vol. VI No.3. PP.5
Basu:
Book Worms, Indian Archives, Vol.1, 1947 PP 127-134
Plenderleith, H.J.:
The Conservarion of Antiquities and Archive work of Art, 1957, PP. 373
Shekeel Ahmed:
The Preservation and Conservation of Records.
Wener A.E, W.:
The Lamination of Documents ICO, 1968.
Hueck H.J.:
Biodeterioration of Textile and Its Prevention 1968, London.
Satya Prakash:
Paper Records and Their Rehabilitaion, Ithihas, 1973 PP.81
Mehra, J.P.:
Health Conservation of Photographic Archives Vol. XXVIII, No. 1978, PP.24.



శ్రీ పర్వతనేని శాంతికిశోర్ పోస్ట్‌గ్రాడ్యుయేట్. అధ్యాపకుడుగా ప్రభుత్వ కళాశాలలో జీవనం ప్రారంభించారు. ఉద్యోగం చెయ్యడం అనవసరమనీ- పదిమందికి జీవనోపాధి చూపించడం మంచిదని భావించి ఉద్యోగం వదిలివేసిన విద్యావేత్త. క్రాంతి రెసిడెన్షియల్ కాలేజి, రాజీవ్‌గాంధీ జూనియర్ కాలేజిలాంటి కళాశాలలు ప్రారంభించిన ఉత్తమ అధ్యాపకుడు. అన్నట్టు ఉపాధ్యాయ దినోత్సవం ఆయన పుట్టిన రోజు. ప్రవృత్తి నాణాలు సేకరించడం. తెలుగులో మహాభారతం టి.వి. సీరియల్ తీసి అపారంగా నష్టపోయినా కళాత్మక హృదయాన్ని కోల్పోని సంస్కారి. కృష్ణా జిల్లా న్యూ మాన్యువల్ కమిటీలో సభ్యుడు. ఆయన ఏమంటున్నారంటే....



**పర్వతనేని శాంతి కిశోర్**
(కృష్ణా డిస్ట్రిక్ట్ న్యూమాన్యువల్ కమిటీ సభ్యుడు)

"నాణాలు చరిత్రకు సజీవ సాక్ష్యాలు. చరిత్ర రచయితలు పరోక్షమైన ఆధారాలతో నిరూపణలు చూపిస్తారు. చాలా సందర్భాలలో అతిశయోక్తులతో కూడిన వివరణలే లభిస్తాయి. ఎలాంటి ఉత్ప్రేక్షలు, అసహజోత్పత్తులు చరిత్రలో ఎలా వ్రాస్తారో తెలియాలంటే ప్రాచీన శాసనాలు చదవండి. కానీ నాణాలు, కరెన్సీ అలాంటివి కావు. అవన్నీ చరిత్రకు మౌన వక్తలు. అలాంటి నాణాలు, కరెన్సీ నా సేకరణలో చాలా ఉన్నాయి. వాటిగురించి వివరిస్తాను"

# చరిత్ర నిర్ధారణకు నిలబడే సాక్ష్యాలు

**మా**నవుడు లోహాలన్నింటిలోకి ముందుగా రాగిని కనుగొన్నాడు. రాగిని ముక్కలుగా చేసి ఆ ముక్కలనే డబ్బుగా ఉపయోగించేవాడు. ఈ లోహపు ముక్కలకు నిర్దిష్టమైన ఆకారం ఉండేది కాదు. ముక్కలు ఏ సైజులో ఉన్నా అన్నిటికి ఒకే విలువ ఉండేది. వాటిమీద లిపిగాని, గుర్తులుగాని మొదట్లో ఉండేవి కావు. క్రమేపి లోహాలను కరిగించటం నేర్చుకున్న తరువాత వాటిమీద కొన్ని జంతువుల బొమ్మలను ముద్రించటం నేర్చుకున్నాడు. ఆ బొమ్మలు కూడ స్పష్టంగా ఉండేవి కావు. కాని అప్పటికి మానవుడు సాధించిన విజయం అదే! అప్పటి నుండి ఇప్పటి వరకు వివిధ లోహాలతో తయారైన నాణాలే వివిధ రకాలుగా మార్పులు చెంది ద్రవ్యంగా చలామణి అవుతున్నాయి.

రాగి లోహాన్ని కనుక్కోవటానికి ముందు అటు తరువాత కూడా చాలా కాలం వరకు మానవుడు 'బార్టర్ సిస్టమ్' ద్వారా తన వస్తు అవసరాలు తీర్చుకొనేవాడు. అంటే వస్తు మార్పిడి ద్వారా అవసరమైన వస్తువులను ఒకరి నుంచి మరొకరు అవసరానికి తగినట్టు మిగులు వస్తువులను మార్చుకునేవారు. ఈ పద్ధతి ఆ గ్రామం లేదా దగ్గర ప్రాంతం వరకే పరిమితమై ఉండేది. ఈ విధానం మొన్నమొన్నటి వరకు కొనసాగింది.

భారతదేశానికి సముద్ర తీర ప్రాంతం ఎక్కువగా ఉన్నందువలన తీర ప్రాంతాలను పరిపాలించే రాజులు ఎక్కువగా ఆ ప్రాంతాలలో లభ్యమయ్యే గవ్వలను, కొన్నిచోట్ల నత్తగుల్లలను, మరికొన్నిచోట్ల సముద్రంలో ఎక్కువగా లభించే పెద్దసైజు పెంకులను చాలా కాలం అంటే దాదాపు లోహాల్ని కరిగించే నాటివరకు ద్రవ్యంగా చలామణి చేశారు. మీరు చరిత్ర తిరగేసినట్లయితే రాజుల ధనాగారాల నిండా గవ్వలు, నత్తగుల్లలు, పెంకులు దొరికినవని తెలుస్తుంది.

మరి రాజులు గొర్రెలను ద్రవ్యంగా ఉపయోగించేవారు. అలాగే గోవులను, ఇతర జంతువులను

ఆస్తులుగా ఉపయోగించుకునేవారు.

చరిత్రకు కావలసిన ఆధారాలలో ప్రధానమైనవి కట్టడాలు, శాసనాలు, ముద్రించిన శిలాఫలకాలు, నాణాలు. కట్టడాలు కాలగర్భంలో కలిసిపోయినవి. పోగా ఇంకా కొన్ని శిధిలాలు కనిపిస్తున్నాయి. శాసనాలు ముద్రించిన శిలాఫలకాలను కొందరు అజ్ఞానులు రాళ్ళుగా ఉపయోగించారు. ఆ విధంగా శాసనాలు అస్తిత్వం కోల్పోతున్నాయి. ఇక మిగిలిన ఏకైక ఆధారం పురాతన నాణాలే. ఈ నాణాల ఆధారంగా చరిత్రను, ఆ కాలంలో పరిపాలించిన రాజుల, ప్రజల స్థితిగతులను జ్ఞప్తికి తెచ్చుకోవచ్చు. అవి మిగిలి వుండడానికి కారణం డబ్బు అంటే ప్రాణంగా కాపాడుకోవడమే!

క్రీ.శ. 78వ సం॥ అంటే శాలివాహన శకం ప్రారంభం నుండి అనగా శాతవాహనులు పరిపాలించిననాటి నాణాల నుంచి నేటి వరకు ముద్రించిన నాణాలలో ఎక్కువ భాగం నేను సేకరించాను. శాతవాహనుల తరువాత కుషానులు, విష్ణుకుండినులు, కనోజి రాజులు, రాజరాజచోళులు, విజయనగర సామ్రాజ్య వ్యవస్థాపకులైన హరిహర, బుక్కరాయలు, సుందర పాండ్య, లోడి వంశము, శ్రీకృష్ణదేవరాయలు, చిక్కదేవరాయలు, జునాగడ్, రామవర్మ, బలరామవర్మ, కృష్ణరాజ వడయార్, టిప్పుసుల్తాన్ రాజులు పరిపాలించినప్పటి నాణాలు, అలాగే ఇండోర్, గ్వాలియర్, తంజావూర్, మైసూర్, నైజామ్, పుదుక్కోటై, బరోడా, మేవా, బికనీర్, భూటాన్, నేపాల్, ట్రావిన్‌కూర్, మణిపూర్ సంస్థానాల నాణాలు, ఈస్ట్ ఇండియా కంపెనీనాటి మద్రాసు ప్రెసిడెన్సీ, బెంగాల్ ప్రిసిడెన్సీ, బాంబే ప్రెసిడెన్సీలకు సంబంధించిన నాణాలు, బ్రిటిష్ ఇండియా కాలంనాటి నాణాలే కాకుండా వెండి, బంగారు నాణాలను కూడ సేకరించాను.

మహమ్మద్‌బిన్ తుగ్లక్ పరిపాలించిన కాలంలో 1325 నుండి 1351 మధ్య కొంతకాలం 'తోలు' నాణాలను కూడా ద్రవ్యంగా ఉపయోగించటం జరిగింది. తేలికగా ఎంత ద్రవ్యాన్నయినా తీసుకు వెళ్ళవచ్చు. తోలుపై రాజముద్ర వేయవచ్చు అనే మంచి ఆలోచనతో తోలు నాణాలను ప్రవేశపెట్టినా ఆయన చేపట్టిన ఇతర సంస్కరణలు కలసిరానందున తోలు నాణాలు కూడా ఎక్కువకాలం చలామణిలో లేవు.

రాజులు ఎవరికి వారు వారి సొంత టంకశాలలలో నాణాలను ముద్రించేవారు. అయితే ఇంగ్లండులోని రాయల్ మింట్‌ను 886లో ప్రారంభించి వెండి నాణాలను ముద్రించటం ప్రారంభించిన తరువాత 1340లో బంగారు నాణాలను కూడా ముద్రించటం ప్రారంభించారు. అప్పటి నుండి ఇప్పటి వరకు రాయల్ మింట్ కొనసాగుతూనే ఉంది.

బ్రిటిష్‌వారి వాదన ప్రకారం అమెరికాను కొలంబస్ 1486లో కనుగొన్నాడు. కాని తాము 886 నుంచే రాయల్‌మింట్‌లో నాణాలను ముద్రించామని బ్రిటిష్‌వాళ్ళు అంటున్నారు. అంతర్జాతీయ స్థాయిలో జరుగుతున్న వారి వారి గొప్పవాదనలు శుష్కమైనవేననీ, వాస్తవానికి భారతీయులే నాణాలను ముద్రించడంలో అగ్రగాములని ప్రత్యక్షమైన ఆధారాలు నా దగ్గర వున్నాయి. ఆ రెండు దేశాలు కళ్ళు విప్పకముందే మనదేశం నాణాలను అచ్చొత్తించింది. ఈ ప్రత్యక్ష సాక్ష్యం నా దగ్గర వున్న క్రీ. శ. 78వ సంవత్సరంనాటి నాణాలు. అంటే అందరికంటే ముందు భారత రాజవంశీయులే నాణాలను ముద్రించారనటంలో సందేహం లేదు. కాని తరచు సామ్రాజ్యాలు చేతులు మారడం లేదా మరణించటం మన నాణాలను ముద్రించే టంకశాలలు కూడా మూతపడుతూ ఉండేవి. కాని బ్రిటిష్ రాయల్ మింట్ 886 నుండి ఇప్పటివరకు కొనసాగుతూ ఉన్నది. అందువలన బ్రిటిష్‌వారి వాదన కూడ నిజమే అనవచ్చు. ప్రపంచంలో ఏ టంకశాల ఒకే పేరుతో ఇంతకాలం పనిచేయలేదు.

నా వద్దకు వచ్చినవారిలో ఎక్కువ మంది నిజంగా గోల్డుకాయిన్స్ ఉండేవా అని అడుగుతూ ఉంటారు. ఒకే కాలంలో వెండి రూపాయలు, బంగారు రూపాయలు ఒకే విలువతో ప్రతి రాజు వద్ద వుండేవి. వాటిని బంగారు కాసులు, వెండి కాసులు అని కూడ అంటారు. అయితే వ్యక్తుల స్థాయిని బట్టి ప్రతిభను బట్టి వాటి ఉపయోగం వుండేది.

బ్రిటిష్ ఇండియా కాలంలో కూడా వెండి, బంగారు రూపాయలు ఎక్కువగా ఉండేవి. ఈ కాలంలో బేడ పావల,

అర్ధరూపాయి, రూపాయి వెండిలో వుండేవి. బేడ లేదా అంతకంటే తక్కువ అంటే అణా, అర్ధనా, కాని, పైస, దమ్మిడి రాగి, ఇత్తడి లోహాలలో 1947-50 వరకు ఉండేవి. ఆ తరువాత రిపబ్లిక్ ఇండియాలో ఒక పైసా నుండి 100 రూపాయల నాణెంవరకు చలామణిలోకి వచ్చాయి.

నాణాల నుండి కరెన్సీకి మారింది. 1893లో హర్షల్ కమిటీ దేశంలో రాజుల ఆధీనంలో ఉన్న టంకశాలలు మూసివేయాలని బ్రిటిష్ ప్రభుత్వం తీర్మానించింది. బ్రిటిష్‌వారు రూపాయి నోటును ముద్రించి ఒక బంగారు నాణాన్ని గాని లేదా దానికి సమానమైన బంగారాన్ని గాని ఇచ్చి రూపాయి నోటును తీసుకోవచ్చునని చెప్పారు. రూపాయి నోటు (పేపర్ కరెన్సీ) కొత్తగా, అందంగా, తేలికగా, ఆకర్షణీయంగా ఉండటం వలన ప్రజలు బంగారాన్ని, బంగారు నాణాలను ఇచ్చి విధిగా రూపాయి నోటును తీసుకున్నారు. ఈ విధంగా భారతదేశంలోని బంగారాన్ని బ్రిటిష్‌వారు కొల్లగొట్టారు. భారతీయులు అమాయకంగా పేపర్ కరెన్సీ మోజులో పడి వెండి బంగారాలను కోల్పోయారు.

భారతదేశంలో బాంకింగ్ వ్యవస్థను తీసుకున్నట్లయితే 1921కి ముందు దేశంలో బ్యాంక్ ఆఫ్ బెంగాల్, బ్యాంక్ ఆఫ్ మద్రాసు, బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర అనే మూడు బ్యాంకులు ఉండేవి. 1921లో ఈ మూడింటిని విలీనం చేసి ఒకే బాంకు చేశారు. అదే ఇంపీరియల్ బ్యాంక్. అప్పటి ఇంపీరియల్ బ్యాంక్ ప్రస్తుతం స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాగా మారింది. 1935లో రిజర్వ్ బ్యాంక్‌ని ప్రారంభించారు. రిజర్వ్ బ్యాంక్ కంటే ముందు ముద్రించిన భారత దేశపు కరెన్సీ కూడా నేను సేకరించిన వాటిలో ఉన్నాయి.

నేను సేకరించిన వాటిలో రష్యాని రాజులు పరిపాలించిన నాటి కరెన్సీ మల్టీ కలర్‌లో ముద్రించినవి. అలాగే ఇతర దేశాల కరెన్సీ, మన దేశ:లో పురాతన కరెన్సీ మరియు ఫ్యాన్సీ నంబర్లు అంటే 111111, 222222, 999999 కలిగిన నోట్లు ఒక రూపాయి నుండి 100 రూపాయల వరకు ఇలా రకరకాల కరెన్సీ వుంది.

అయితే నోట్లు సేకరించటం చాలా ఖర్చుతో కూడుకున్నపని. ఎందుకంటే నాణాలు రూపాయికంటే తక్కువ విలువలో ఎక్కువ రకాలు ఉంటాయి. కాని నోట్లు ఒక రూపాయితో ప్రారంభమై 5, 10, 50, 100, 500, 1000 రూపాయల వరకు ఆ దేశ ఆర్థిక విధానాలననుసరించి ఉంటాయి. కొన్ని దేశాలలో 5,000, 10,000, 50,000, 1,00,000 డినామినేషన్ల వరకు కూడ నోట్లు ముద్రించారు. ఇవి కూడ నేను సేకరించిన వాటిలో ఉన్నాయి. రెండో విషయం పేపర్ కరెన్సీని నాణాలవలె ఎక్కువకాలం భద్రపరచటం కూడా కష్టమే. కనుక కరెన్సీకి ఎక్కువ విలువ ఉంటుందనుకోవడం పూర్తిగా సమంజసం కాదు.

కాలగర్భంలో కలిసిపోయిన నాణాలు పోగా మిగిలినవి అసలు బయటకు రావడం లేదు. అలా రాకపోవడానికి ప్రధాన కారణం నాణాలు సేకరించేవారిలో పీనాసితనం, భయం, భయానికి ప్రధాన కారణం ప్రభుత్వం. ఈ విశ్లేషణ విషయాంతరం.

నేను సేకరించిన నాణాలలో ఆసక్తికరమైన విషయం ఒకటి ఉన్నది. మన మతం, మన సంస్కృతితో ఏమాత్రం సంబంధంలేని ఇంగ్లీషు వాళ్ళు ముద్రించిన నాణాలు. ఈస్టిండియా కంపెనీ 1617లో ముద్రించిన నాణాలు. లక్ష్మీదేవి, బాలకృష్ణుడు, దుర్గాదేవి, ఆంజనేయస్వామి, రామపంచాయతనం... ఇలా రకరకాల నాణాలు నావద్ద ఉన్నాయి.

సెక్యులర్ సిద్ధాంతాలను నమ్మిన మనవాళ్ళు ఇప్పుడు అలాంటి నాణాలు ముద్రిస్తారా? ఒకవేళ ముద్రిస్తే దేశంలో ఎంత గగ్గోలు మొదలవుతుంది! నాకనిపిస్తుంది- సెక్యులరిజం పేరుతో మనం మన సంస్కృతిని, చరిత్రను మరచిపోతున్నామని.

చివరగా ఒక్కమాట! నాణాలు చరిత్రకు సాక్ష్యాలు. నేను సేకరించిన నాణాలపైన వివరణలు వ్రాస్తే ఉద్గ్రంథం తయారవుతుంది. ఎంతో వ్యయ ప్రయాసలకు, వ్యధలకు లోనై వాటిని సేకరించాను. వాటి వివరణలు అందరికీ ఎలా తెలుస్తాయి? ఇదే నా బాధ! ●

# Krishna District New Manual Committee



Sri K. Prabhakara Reddy, IAS, (Chairman, The krishna District New Manual Committee)

Sri Siram Ramarao, Sri E.Gopala Krishna Reddy , Sri Parvathaneni Shanthi Kishore, Sri Dasari Ramakrishna, Sri Chalasani Ajay Kumar, Dr. G.V. Purnachand, Sri Immadisetti Rama Kumar, Sri Lanka Venkata Ramana

74

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | GNJ20/D/90 | Date | 23/11/2020 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CI, 73 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Deepika | Scanned | Ramya |
| BOOK SIZE | H 9.5 W 7.2 | Pages | 77 |